# కుమార విజయము



ఉభయభాషాప్రవీణ

కొమ్మనమంచి జోగయ్యశర్మ

వెల రు 1-4-0

Prescribed as a detailed Prose-Text for the Intermediate Examination, 1948 of the Andhra University.

# కుమార విజయము

గ్రంథకర్త:

కొమ్మనమంచి జోగయ్యశర్మ.




ప్రకాశకులు:

శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్ డిపో,

రాజమండ్రి.



1946

[వెల **1—4—0**

Ranga Rao.

No. 445

కవికుల తిలకుఁడగు మహాకవి కాళిదాసు 'కుమార సంభవము' న కియ్యది స్వేచ్ఛానువాదము. గ్రంథవిస్తర మొదవించు, కథాంశమునకు భంగము గలిగింపని వర్ణనాదివిషయముల నలంతిగా నిందు విడనాడియుంటిని. అట్టిచో విషయ పరిపుష్టికిని, పఠనానుకూల్యమునకును, మూలముతో పొందుపడునట్లు గొన్ని విషయములు చేర్చియుంటిని.

సాధ్యమైనంతవఱకు, మూలమును జాగరూకతతోనే యనువదించితిని, అయినను పరివర్తనముగదా! దోసఁగులేవేని దొరల వచ్చును. పాఠకులు సహృదయతతో మన్నింతురుగాక.

అనువాదకుఁడు.

# కు మా ర వి జ య ము

## ప్రథమ స్తబకము

## ఉ మా జ న న ము

———:O:———

శ్రీమంతంబై సకలమునిమనోనురక్తమై కర్మభూమియని పేరుగాంచిన భరతఖండమున కుత్తరమున పూర్వాపరసముద్రములను దాఁకి భూమండలమునకుఁ గొలుచు నలువసృజించిన మానదండమో యనఁ జూపట్టు హిమవన్నగము రాజిల్లుచుండును. ఏపర్వతము గంగాదిపుణ్యనదుల కుత్పత్తిస్థానమై యొప్పుచుండునో, యేభూధరము నిజోన్నతశృంగములచే నంబరతలము చుంబించుచుఁ దనగిరిరాజత్వమును బ్రకటించుచుండునో, యేగిరివరము రాజర్షి బ్రహ్మర్షి తపోవనంబుల కాలవాలమై యొప్పారుచుండునో, యేపర్వతము దేవ గంధర్వ కిన్నరామరాంగనా వివిధగానంబుల కట్రాంత లూఁగుచుండునో, యే కుధరము నరనారాయణ చరణాంకములచేఁ బవిత్రమయ్యెనో, యేసానుమంతము సహస్రహాసముఁ దాల్చి, మోహప్రదోగ్రగా, గోరూపధారిణియగు భూమిని పర్వతములన్నియుఁ బాలుపిదికి రత్నరాసులను బంచుకొనుటకుఁ గారణమయ్యెనో, యేమహీధరము నిజౌన్నత్యముచే నిజపవిత్రతచే నిజరత్నమాహాత్మ్యముచేఁ

బర్వతములకెల్ల మేటియని పేరుగాంచెనో యట్టి యా హిమాలయము బ్రహ్మయొసంగిన యజ్ఞభాగిత్వమును శైలాధిపత్యమును వహించి దేవతాత్మకమని ప్రఖ్యాతి గాంచెను.

ఆపర్వతరా జన్నిటం దనకనువగు గుణములుగల మేనయను కన్యకామణిని బరిణయంబై, యామెయందు మైనాకుండను కుమారుని బడసెను. అంత నొక్కింతకాలమునకు దక్షపుత్రియు శివునిపూర్వపత్నియు నగు సతీదేవి యజ్ఞమునం దండ్రిచే నవమానమునంది, యోగమార్గమున శరీరమును విడనాడి, నగరాజదంపతులకు దుహితయై జన్మించెను.

రాజదంపతు లాబాలికకు జాతకర్మాది సంస్కారములొనరించి సమస్తబంధుజనాదర పూర్వకముగా పార్వతి యను నామధేయమిడిరి. చిడిముడిపాటునం జిందులుద్రొక్కుచు, జిలిబిలినవ్వులం "జిలిపిచేష్ట" లొనర్చుచు వివిధశైశవక్రీడల నలరారు నా బాలికామణిం గాంచి తలిదండ్రు లమితానందమున నుప్పొంగుచుం, దగినప్రాయమున నామెను విద్యాభ్యాసమునకై యొజ్జలకడం బెట్టిరి. శరత్కాల మరుదెంచినంత మందాకినికి రాయంచ లరుగుతెఱంగున, రాత్రియైనంత మహౌషధిని దనకాంతులు చేరువడువున నుపదేశకాలమందే పూర్వజన్మవాసనావశముచే విద్యలన్నియుం బార్వతిని బ్రాపించినవి. అంత నాయమ సమస్తవిద్యావిశారదయై జననీజనకులకేగాక యెల్లరకు నానందసంధాయినియై యొప్పియుండెను.

క్రమక్రమమున నామెసర్వాంగకములు యౌవనాభిరామములై యలరారఁ జొచ్చెను. అమృతము స్రవించు నామె మధురాలాపము లాలించినఁ గోకిలకలకూజితమును తంత్రీమంజుల స్వనమును కర్ణకఠోరములుగా నుండును. సవిలాసమందగమన ప్రచారయగు నామె పాదవిన్యాసము వీక్షించినచో రాయంచ లీమెకడ నడలు నేర్చిననా యను సంశయ మొదవకమానదు. విద్యకుఁదగిన వినయమును, వినయమునకుఁ దగిన సౌశీల్యమును, అన్నిటికి వన్నెవెట్టు నవయౌవనమును వీనిచే నొప్పారుచున్న పార్వతిని గాంచి, "సృష్టిలోఁ దనకుఁ గల సామర్థ్యమెల్ల వినియోగించి నలువ సకలగుణసంపత్తిని సమస్తవిద్యావైభవమును నిఖిలసౌందర్యరాశిని నేకమొనర్చి యీరూపమున సృజించెనా!" యని లోకు లనుకొనుచుందురు. ఇట్టి చదువులసరస్వతిని గాంచి సంతోషతరంగముల నుయ్యాలలూఁగు తలిదండ్రుల మహాభాగ్య మేమనవచ్చు! గృహమునకంతకు నూత్నాలంకార మొనర్చు నిట్టి తేజోరాశిం గాంచి మురిసిపోవు తలిదండ్రులయదృష్ట మెంతని వర్ణింపఁగలము! సమస్తజనశ్లాఘాపాత్రమై యలరు నిట్టి మించుఁబోఁడికి జననీజనకులనిపించుకొనువారి యానంద మెంతని చెప్పఁగలము!

సంప్రాప్త యౌవన శోభా విరాజమానయై, సమస్త గుణరత్న మహోదధియై యొప్పుచున్న యా పార్వతి పిత్రుసమీపమున నుండఁగా, నొకనాఁడు స్వేచ్ఛాసంచారియగు

నారదుఁడు గాంచి "యీమె పరమేశు నర్ధాంగహారిణియై, యేకపత్నియగు" నని పల్కెను. ఆకారణముచేఁ బార్వతి ప్రగల్భవయమునఁ గన్నను, అన్యవరు నన్వేషించుటలో హిమవంతుఁడు ప్రయత్న మొనరింపలేదు. మంత్రపరిపూతమగు హవ్యమును గ్రోల్చుటకు నితరహోత్రుం డర్హుఁడె? నన్యతేజము లనర్హములుగదా! పరమేశుఁడు కోరకుండఁ దానై యెడలి దుహిత నొసంగెద నని చెప్పుటకును హిమవంతుఁ డిచ్ఛగింప లేదు. యాజ్ఞాభంగము నందఁ జేయు నను భయముచే నిట్టి కార్యము లందుఁగూడ సజ్జను లౌదాసీన్యము వహింతురు!

సతీదేవి తండ్రియింటనలి కినుకచే యోగాగ్నియందు శరీరమును విడనాడినది మొదలు హరుఁడు సర్వసంగముల విడనాడి, మరలఁ బరిణయమాడక, హిమాలయమునందు మందాకినీప్రాంతమున దేవదారుద్రుమ పరివేష్టితమును కిన్నరగాన మనోహరమును నగు వటీతటియందు నివసించుచు, నచటఁ దనమూర్త్యంతరమగు నగ్నిని బ్రతిష్ఠించి, యొకరొనర్చెడు తపస్సులకు వరములొసంగెడు తాను ఎద్దియోమనోరథముతోఁ దపం బాచరించుచుండెను. ప్రమథాదిగణములన్నియు నమేరు ప్రసవముల నవతంసములుగా నలంకరించుకొని, మృదుల భూర్జ వసనములఁ దాల్చి, మనశ్శిలారజంబున శరీరముల నలందుకొని యయ్యాశాసుని బరివేష్టించి యాతని సేవ లొనర్చుచుండెను.

అద్రినాథుఁ డావిషయమెఱిఁగి యటకేగి మెల్లనేల్పులకు నారాధనీయుఁడగు నయ్యష్టమూర్తిని యథావిధిగాఁ

బూజించి, సఖీసమేతముగాఁ గొమరితను శుశ్రూషకై యాతని కడఁ బెట్టెను. స్త్రీసాన్నిధ్యము తపఃప్రతికూలమయ్యును మహేశుఁడామె పరిచర్యయొనర్చుట కంగీకరించెను. మనస్సంక్షోభ కారణములున్నను నెవరిహృదయములు చలింపవో వారుగదా ధీరులు! పిమ్మట జనకు నాజ్ఞానుసారముగాఁ బార్వతి చెలికత్తెలతోఁ గూడి శివునిసన్నిధిని ప్రతిదినమును బూజాపుష్పముల సేకరించుచు జపవేదిని సమ్మార్జనమొనర్చుచు, నిత్యక్రియోపయోగములగు జలములను దర్భలను గొనివచ్చుచు, నాతని తలయందలి నెలవంక వెన్నెలలు శ్రమమునపనయించుచుండ మహేశున కుపచారము లొనర్చుచుండెను.

---

# కుమారవిజయము

## ద్వితీయ స్తబకము

# బ్రహ్మసాక్షాత్కారము

:o:

తారకుఁడను రాత్రించరుఁడొకఁడు దీర్ఘకాలము ఘోర తపంబొనర్చి, బ్రహ్మవలన ననేకవరములఁ బడసి, మట్టుమీఱి, దేవలోకంబు నుజ్జూఁతలూఁగించియు, భూలోకవాసుల నడలఁ గొట్టియుఁ, బాతాళవాసుల భంగపఱచియు, గరుడుల గర్వ మడఁచి, గంధర్వుల యేపుమాపి, కిన్నరులఁ గింకరుల నొనర్చుకొని, కింపురుషులఁ గింపురుషులఁ గావించి, యక్షుల భ్రష్టులఁ జేసి, భువనంబులన్నియుఁ గలంచివైచుచుఁ, బ్రాణులపాలిటి ధూమకేతువై, యిచ్చవచ్చిన తెఱఁగునఁ గ్రూర వీరవిహార మొనర్చుచుండెను.

దేవతలీబాధలకుఁ దాళలేక, తారకుఁడు తమ్మిడుములఁ గుడుపుచున్న తెఱఁగెఱిఁగించుటకై యింద్రపురస్సరముగా బ్రహ్మకడకుఁ బోయిరి. వాణి యర్ధాసన మలంకరింప, నారదుఁడు మృదుమధురగానం బొనర్చుచుండ, దేవర్షి బ్రహ్మర్షి గణంబులు వేదాంతచర్చ సేయుచుండ, రత్నకంకణములు మంజులస్వనములీన నిద్దరు ముద్దియ లిరుగెలంకుల వింజామరలు

వీవ నిండుపేరోలగంబున్న యవ్విరించిం గాంచి, శతమఖాద్యమరులు వినయ వినమితోత్తమాంగులై సాష్టాంగ ప్రణామము లాచరించి బహువిధముల స్తుతించిరి. హిరణ్యగర్భుఁడును వచ్చిన దేవతలనెల్ల నుచితప్రకారంబున నాదరించి, వారియాననములు వసివాఁడి ఖిన్నములై యుండుటకు హేతువెఱిఁగియు నది వారిముఖముననే వినఁగోరి "మీకంటకులకుఁ గుశలమే కద? యాయజూకు లొసఁగు హవిర్భాగములు నిరాతంకముగా మీకుఁ జేరుచున్నవా? మీమీయాధిపత్యములు పూర్వము వలెఁ జెల్లుచున్నవా? నాలోకమునకు వచ్చియు మీయాననములు వన్నెదఱిగి ఖిన్నములై యున్నవేల? విశేషము లేవియుఁ బుట్టకుండునుగదా?" యని ప్రశ్నించెను. అంతఁ దమరాకకుఁగారణము విన్నవింపుమను నాశయముతో నింద్రుఁడు బృహస్పతిమోమువంక గాంచె. సురాచార్యుఁడును వాచస్పతి దిక్కు మొగంబై దోషాచరుఁడగు తారకుఁడు తమ్ముఁ బఱచిన పాటులు నివేదింప నిట్లు చెప్పఁదొడఁగె.

"పితామహా! సమస్త చరాచర స్రష్టవైన నీవెఱుఁగని విషయముండునె? ఐన నడిగితివిగాన జెప్పెద నాలింపుము. నీవొసఁగినవరముల నొంది తారకుఁడను రక్కసుఁడు గర్వాతిరేకమునఁ గన్నుమిన్ను గాననివాఁడై, లోకోపద్రవమున కొక ధూమకేతువై యున్నాఁడు. సర్వసాక్షియు జగద్బాంధవుఁడు నగు భానుఁడుసైతము వానిప్రతాపమునకు వెఱఁగంది, యు

తనిపట్టణమునఁ గమలోన్మీలనమాత్రమున కుపచరించు నుష్ణ తను బ్రసరింపఁజేయుచుండెను. ఆరాజగు శీతభానుఁడున్నైతము శివజటాలంకృత రేఖదక్కఁ దక్కినకళలచే నతనినే సర్వదా సేవించుచుండును. సమస్తలోకములఁ గంపింపఁజేయుఁజాలు ప్రకంపనుఁడు గూడ వీవనలచేవీచునట్లతని సమీపమునఁ బ్రసరించుచుండును. ఋతువులన్నియుఁ బర్యాయసేవ నుజ్జగించి యుద్యానపాలకులవలె నతనినే యెల్లవేళలఁ గొల్చుచున్నవి. గంభీరుఁడగు పయోధియు నతనికయ సంపాదించుటకై కానుకలుగా నొసంగ నమూల్యరత్నము లెప్పుడు తనలోఁ బొడమునా యని నిరీక్షించుచుండును. వాసుకిప్రముఖ సర్పరాజములు గూడ జ్వలన్మణిదీపములచే రాత్రుల నాతని సేవ యొనర్చుచుండును. శతమఖంబులొనర్చి సర్వ స్వర్గరాజ్యాధిపత్యమును వహించిన యీ యింద్రుఁడు గూడ వానియనుగ్రహముఁ గోరి కల్పద్రుమ భూషణోపహారముల దూతలచే నంపుచు నాతని యానుకూల్యమునకై నిరీక్షించుచుండును.

ఇట్లు దేవతాప్రధానులందఱు నాతనిదయకుఁ బాత్రులుగానెంచి తత్తదనుకూలసేవలఁ జేయుచున్నను, ఆదుర్మార్గుఁ డెల్లర వేధించుచున్నాఁడు. కఠినముగాఁ దాఁకినఁ గనుగందునేమోయను భయమున నమరకన్యలతిదయతోఁ బల్లవములఁ గోయు కల్పవృక్షములను నిర్దయుఁడై నఱికి నైచి పడఁద్రోయుచుండును. స్వర్గరాజ్య కీర్తిపతాకములగు మేరుశృంగముల

నుత్పాటించి, తన యారామములందుఁ గ్రీడాపర్వతములుగాఁ జేసికొనినాఁడు. పవిత్ర గంగానదిని గలంచివైచి యందలి హేమాంభోరుహముల సమూలముగాఁ బెల్లగించి వానిఁ దన దీర్ఘికలందు నాటుకొనినాఁడు. ఆ క్రూరుఁడు మార్గమధ్యమున నడ్డగించి యెవ్వరి నేవిధమున బాధించునోయను భయమున దేవతలెవ్వరును లోకసంచారమునే మానివైచిరి. మహాధ్వరములందు యజ్వలొసఁగు హవ్యములను మేమందఱముఁ జూచుచుండఁగనే మాయావియై హవ్యవాహనుని ముఖమునుండి హరించుచుండును. మూర్తివంతమగు చిరకాలార్జిత యశమా యనిపించు నింద్రుని యుచ్చైశ్శ్రవమును తనవశము గావించుకొనియె. అట్టి యా దురాత్ముని దుండగములు మాన్పుటకై మే మొనర్చినయత్నములన్నియు వమ్మయ్యెను. ఇంతయేల మే మెద్దానియందు జయాశ గలిగియుంటిమో యట్టి యమోఘమగు హరిచక్రముగూడ నాతనికంఠమునఁ బూలమాలయై పోయినది. కాన నోప్రభూ! వానిని జయించుటకుఁ దగిన సేనానిని సృజింపుము. తత్పురస్సరముగా నింద్రుఁడు తారకునితో యుద్ధమొనర్చి, యింతవఱకు నా కలకులకన్యకుని బందెలో నిట్టూర్పుపుచ్చుచున్న యమరరాజ్యలక్ష్మిని బంధవిముక్తురాలి నొసరించును.” అని బృహస్పతి మనవియొనర్చిన దేవతల బాధలాలించి యాపితామహుఁ డిట్లు ప్రత్యుత్తర మొసఁగె:

"త్రిదశులార! అచిరకాలములో మీమనోరథము నెఱవేఱఁగలదు. కొంతకాలముమాత్రము నిరీక్షింపుఁడు. నేనైయట్టిసేనాధిపతిని సృష్టింప వీలులేదు. ఆదైత్యుఁడు చిరకాలము తపమొనరించి నావలనఁ దొల్లి వరముల సందెను. అట్టి నేను వీనిని సంహరించువీరుని సృజించుట పాడిగాదు. విషవృక్షమునైనను బెంచి తనచేతులతోఁ బెఱికివైచుట యధర్మముగదా! అదియుఁగాక యిక్కార్యము నెఱవేర్చుట ముక్కంటికిఁదక్క నొండొక్కనికి శక్యముగాదు. ఆతఁడిప్పుడు సర్వసంగపరిత్యాగియై,హిమవన్నగమందు మహాసమాధినిమగ్నుఁడై యున్నాఁడు. హైమవతియు శుశ్రూషయొనర్చుచు నాతనికడనే యున్నది. ఎట్లైనను మహేశునిహృదయము పార్వతియందుఁ బ్రసరించునట్లు గావించితిరేని, వారివలనఁ గలిగిన కుమారుఁడు మీకు సేనానియై సర్వకార్యముల నెఱవేర్పఁగలఁడు." అని చెప్పి బ్రహ్మ దేవతలకు సెలవొసంగ, వారును భావికార్యము నిర్వహించు తలంపులతో నమరలోకమునకు వెడలిరి.

---

# కు మా ర వి జ య ము

## తృతీయ స్తబకము

# మ ద న సం హా ర ము

——:o:——

మఱునాఁ డింద్రుఁడు నిండుకొలువుండి తమయభిలషితము నీడేర్పఁ బంచసాయకుఁడే సమర్థుఁడని యెంచి యాతని నొకమాఱు స్మరించెను. అంత, నందగత్తెల భ్రూలతలయందము నాచికొన్న చెఱకువి ల్లంసతలమున ధరియించి వేడుక చెలి కాఁడగు వసంతుఁడు కాన్కగా నొసఁగిన చూతాంకురమును గేలఁ గీల్కొలిపి, రతి ప్రేమడితోఁ గోసియిచ్చిన నవమల్లి కాది సుమంబులఁ దూణీరమున నందముగాఁ బొందుపఱచి, శృంగారమూర్తియగు మన్మథుఁడమరేంద్రు నెట్టయెదుట సంజలిఘటించి నిలువంబడఁ, గార్యార్థియైన శతముఖుఁ డతనిఁ దనసమీపమునఁ దావొసఁగి కూర్చుండఁబెట్టె. మన్మథుఁడును ప్రభుని యాయనుగ్రహమును శిరసావహించి యాతనితో నిట్లనియె:

"ప్రభూ! నన్నేల యిటకు రప్పించితిరి? నేనునిర్వహింపఁ దగిన కార్య మెద్దియైన నున్నచో నాసతిచ్చి యనుగ్రహింపుఁడు. నిమేషమాత్రమున నెఱవేర్చి మీదయకుఁ బాత్రుఁడఁ గాఁగలను. మీపదవిని గాంక్షించి యెవ్వఁడేనియు దీర్ఘతపం

బొనరించుచున్నచోఁ దెల్పుఁడు; అస్మదీయ ధనుష్టంకార
ము చే క్షణమాత్రములో నాతని మీయాజ్ఞకు బద్ధునిగా నొన
ర్తును. మీకనిష్టుఁడైనవాఁడేని ముక్తినిగోరి తపంబాచరించుచున్న
చో నెఱిఁగింపుఁడు; అట్టివానిని వృటిలోఁ గామినీ కటాక్ష పాశ
బద్ధునిగా నొనర్తును. మీశత్రువగువాఁ డాదైత్యగురునిచే
నీతిశాస్త్ర మభ్యసించినవాఁడైనను సరే తెల్పుఁడు వానియర్థ
ధర్మములను నిర్మూలమొనర్తును. ఇంతయేల మీయాజ్ఞయైన
చో, కుసుమాయుధుఁడనని సందేహింపకుఁడు. వసంతుఁడొక్కని
సహాయునిఁగాఁగొని పినాకపాణియగు నాత్రినేత్రునిధైర్యముఁ
గూడఁ గలంచివైవఁగలను; సంకోచము వీడి యాజ్ఞాపింపుఁడు."
ఇంతవఱకుఁ గాలిపైఁ గాలిడుకొని కుసుమాయుధుని మాట
లాలించుచున్న యసురారి తుదిమాటలు చెవినిబడినంతనే
యొకకాలు పాదపీఠిపై నిడి, తనప్రయత్నమున కనుకూల
ముగాఁ బ్రసంగించిన పంచసాయకు నభినందించుచు నిట్లనియె:

"ప్రియసఖ! నావజ్రాయుధ మమోఘమయ్యు మహాతపో
నిధులయెడ మాత్ర మయ్యది మొక్కవోవుచుండు. నీకుసుమా
యుధమన్ననో సర్వతఃప్రసరము, నమోఘము, సర్వకార్య సా
ధకమునై యున్నది. నీసామర్థ్యము నేనెఱింగియే మాకలవిగాని
యొకకార్యము నిర్వహించుటకై నిన్ను నియోగింప సంక
ల్పించితిని. సమస్త భూభారమును మోయఁదగిన సమర్థుఁడని
యెంచియేగదా యాదిశేషుని శ్రీపతి తనశయనముగా నొన

రించుకొనిమె. ఇఁక నీవాచరింపఁదగిన కార్య మాలింపుము. హిమాలయమున గంగానదీప్రాంతమున ముక్కంటి తపంబా చరించుచున్నాఁడు. పార్వతియాతనికిఁ బరిచర్యలఁ జేయుచు సఖీసమేతయై యచటనే యున్నది. నీ యమోఘ బాణప్రయోగముచే నెట్లయిన నాశివుని హృదయము గలంచి, యాతని మనసు హైమవతియందుఁ బ్రసరించునట్లొనర్పవలయును. అయ్యుమామహేశుల కుదయించిన కుమారుని సేనానిగాఁ జేసికొని యమరులు తారకుని జయింపఁదలంచుచున్నారు. దేవతల జయము నీయఱచేత నున్నదని తలంపుము. నీయదృష్ట మేమన వచ్చును! నిన్ను యాచించు వారా దేవతలు; ప్రయోజనమా మూఁడులోకములకు సంబంధించియున్నది; చేయవలసినపనియా నీ కోమల కుసుమబాణములో నిమిడియున్నది; హింసయా లేశమైనను లేదు. అనన్య సాధారణమగు కీర్తిని సంపాదింప నింతకన్న నవకాశ మెయ్యది గలదో నీవ యోజించుకొనుము. సహచరుఁడగుటచే వసంతుఁడు నీకీకార్యమున స్వప్రేరితముగనే సాహాయ్య మొనర్చును. హుతాశనునకుఁ దోడ్పడుమని వాయువును బ్రోత్సహింప వలయునా? కాన వసంతాదులతో బయల్వెడలి శీఘ్రముగాఁ గార్యము నెఱవేర్చి దేవతల మనోరథమీడేర్పుము; జయమగుఁగాక.” అని యైరావతాస్ఫాలనముచేఁ గర్కశమైన యఱచేత నాతని మేను నిమురుచుఁ బ్రయాణసన్నాహ మొనర్పఁ, బంచసాయకుఁడు వల్లెయని యింద్రునానతి నౌఁదలఁదాల్చి కార్యనిర్వహణార్థము బయలువెడలెను. హస్త

చాలనమాత్రమున మోదులఁగూడఁ జివురులెత్తింపఁజేయఁ గల వసంతుఁడును, అక్షిప్రసారమాత్రమునఁ ద్రిభువనముల విముగ్ధములఁ జేయఁజాలు రతియు వెనువెంట వచ్చుచుండ, నభినవ శృంగార మూర్తియగు కుసుమసాయకుఁడు హిమవంతమందలి పరమేశు నాశ్రమము ప్రవేశించెను.

అంత వసంతమూర్తియు మోక్షసౌధాంత్య సోపానమున నున్న మునీంద్రుల హృదయములు సైఁతము కలఁతవడునట్లు, వయస్యుని భావిప్రయత్నమున కనుకూలముగా వనమందెల్లడ విజృంభింప మొదలిడెను. వివిధ కుసుమ సురభి గంధవహాంకురములు మందమందములై వ్యాపింపఁదొడఁగె. అకాలమయ్యు సుందరీ పాదస్పర్శము లేకయే యశోక మామూలాగ్ర మరుణారుణ పల్లవములఁ దొడిగికొని కుసుమింపఁజొచ్చె. నవారుణ పల్లవ కంకపత్ర సంశోభిత చూతబాణములపై వసంతుఁడు లిఖించిన మన్మథుని నామాక్షరములాయనునట్లు చంచరీకములు వ్రాలఁ జొచ్చె. లేమావి చివురుల మెసవిన కోకిలము కలకంఠనాదముతోఁ బంచమస్వర మాలపించుచుండె. మహేశు తపోవనమందలి మునులందఱు నయ్యకాలవసంతోదయముచేఁ గలఁతవడుచున్న తమహృదయముల నతిప్రయత్నముతో నిగ్రహించుచుండిరి.

ఇక్షుచాప మంసభాగము నలంకరింప, రతిద్వితీయుఁడై మన్మథుఁడయ్యాశ్రమము ప్రవేశించినంతనే ప్రాణిద్వంద్వములు

తమశ్శృంగార భావములను క్రియారూపమునఁ బ్రకటింప మొదలిడినవి. భ్రమర మలికాంతతోఁగూడి యొకేపూదొన్నియలో మధువు లారగింపఁ దొడఁగె. కృష్ణసారము శృంగముతో గీఱుచుండ సజమోదుప్పకనుదోయితో మృగవధూలలామ యయ్యానంద పారవశ్య మనుభవించుచుండె. చెమ్మటలచేఁ బత్రలేఖలు గరఁగి వింతసోయగము నొదవింపఁ, గుసుమాసవ మానుటచేఁ జంచలాతిచంచలములైన కన్నులుగల ప్రియురాలి మోముదమ్మిని కింపురుషుఁడొకఁడు గానమధ్యముననే ముద్దిడుకొనుచుండెను. కరేణువొకండు పంకజరేణువులచేఁ బరిమళించుచున్న గండూషజలమును ద్విపమున కందిచ్చుచుండెను. చక్రవాకము సగముగొఱికిన బిసాంకురము నొసఁగి ప్రియురాలి యాదరముఁ బడయుచుండెను. వికసిత పుష్ప స్తబకావనమ్రములై యరుణపల్లవ మనోహారిణులగు లతాకాంతలను తరువులు లేఁగొమ్మలతో నాలింగన మొనర్చుచుండెను.

ఇట్లు తపోవనమంతయు వసంత మన్మథ ప్రభావమయమై యుల్లసిల్ల, నప్సరోంగనా మృదుమధుర గాన మెల్లెడ వీనులకు విందొసఁగుచుండ, హరుఁడిదియంతయు నరసి యొక్కింతయుఁ జలింపక యాత్మానుసంధాన నిమగ్నుఁడై యుండెను. అవిచ్ఛిన్నాత్మ నిగ్రహులై గాఢసమాధి నివిష్టులగు మహాత్ముల హృదయములనా యట్టివిఘ్నములు కలంచునవి!

నందీశ్వరుఁడు సౌవర్ణవేత్రదండమును ధరియించి లతా మండపద్వారమున నిలువంబడి, సరోష విస్మయ స్తిమితావ లోకనంబుల నంగుళిసందర్శన మాత్రముచేఁ బ్రమథగణములు కోలాహల మొనరింపకుండ నాజ్ఞాపించుచుండెను. ఆతని శాస నముచే వృక్షతతిగూడఁ గంపించుట మానివైచెను. మృగ శకుంత వ్రాత ప్రచార మడంగె. కాననమంతయుఁ జిత్రపటార్పి తాకృతిని దాల్చి యతిప్రశాంతముగా నుండెను.

మన్మథుఁ డాతనిదృష్టిపథముఁ బరిత్యజించి, పున్నాగ తరువులు చుట్టువాలొఁనియున్న శివసమాధిస్థలమును బ్రవే శించి యట నొకపొదరింట డాఁగియుండెను. అయ్యాశ్రమ మధ్యప్రదేశమున శార్దూలచర్మాస్తరణముగల దేవదారుద్రుమ వేదికపైఁ బరమేశుఁడు వీరాసనాసీనుఁడై యుండెను. ఆతఁడు ఫణిరాజములచే జటాకలాపమును బిగియించి ముడివైచెను. దృష్టిని నాసాగ్రమందుంచెను. అంతర్వాయువుల నిర్బంధించు టచే గాలిలేనిచోటనున్న దీపశిఖవలె నిశ్చలుఁడై యుండెను. సర్వేంద్రియవ్యాపారము నడంచెను. ఆతని బ్రహ్మరంధ్రము నుండి తేజోమండలము వ్యాపించుచుండెను. ఇట్లుండి తన్ను దా ధ్యానించుకొనుచున్న యాత్రిపురారిని గాంచి, మన్మథుఁడు భయముచే వడవడ వణఁకుచుఁ బాణితలమునుండి చాపము జాఱుటయేని గుర్తింపఁజాలఁడయ్యె.

ఆసమయమునఁ, బద్మరాగములఁ దిరస్కరించు నశోకకుసుమములఁ గైసేసికొని, సౌవర్ణశోభను గేలిసేయు కర్ణికారములు ముంగురులం దలంకరించుకొని, ముక్తాకలాపములఁ బరిహసించు సింధువారములఁ గంఠమున హారములవడువునఁ బొందుపఱచి, నవోదిత వసంతప్రసూన భూషణాలంకృత సర్వాంగియై, కటిభాగ స్రస్త వకుళకాంచీమాలను సారెకు సవరించుకొనుచు, సుగంధి నిశ్వాసాకృష్టమై బింబాధరసమీపమున మాటిమాటికిఁ జరించు మధుపమును సంభ్రమ విలోల లోచనయై లీలారవిందముచే నివారించుచు, బాలార్కారుణ వసనము ధరించి, పుష్ప స్తబకావనమ్రయై కిసలయవిరాజమానయై నడయాడు లతవలె హైమవతి యిద్దఱుచెలికత్తియలు వెంటవచ్చుచుండ, శివతపోవనద్వార సమీపమున కరుదెంచి, సేవావసరమును బ్రతీక్షించుచుండెను. భువనైకమోహినియగు రతికిఁగూడ లజ్జనొదవించు నామెప్రకృతిలావణ్యము పరికించి, మనోభవుఁడీమెవలనఁ దప్పక తనకార్యము నెఱవేఱునని తలంచుచుండెను.

శివుఁడు సమాధిచాలించుటెఱిఁగి, నంది 'శుశ్రూషకై పార్వతి ద్వారముకడ వేచియున్న'దని మహేశునకెఱిఁగింప, నక్షిసంచలన సంజ్ఞామాత్రమునఁ గైలాసనాథుఁ డామెను బ్రవేశపెట్టుమని సూచించెను. పార్వతి సఖీసమేతయై, నంది మార్గముఁ జూపుచుండ లోనికిఁ బ్రవేశించెను. అంతఁ జెలిమి

క_ర్త్రియలు నవపల్లవ కుసుమ సముచ్చయమును ముక్కంటి పాదపీఠి కుపహారముగా నర్పింప, హైమవతి, విలోల నీలాలక మధ్య సంశోభి కర్ణికారమును సవరించుకొనుచుఁ, గర్ణావతంసారుణపల్లవములు జాఱుచుండ, నవనతాననయై, సంక్షి_ప్త మన్మథ పతాకమాయనునట్లు సంకుచితసర్వాంగియై మహేశు నకుఁ బ్రణామ మొనరించెను. 'అనన్యభాజం పతిమాప్నుహి' యని యాశీర్వదించినాఁ డయ్యష్టమూ_ర్తి. భావివిషయముఁ బరి కింప నయ్యది యథార్థమే యగును. మహాపురుషుల ప్రసంగ మెన్నఁడును కార్యానుకూలముగా నుండునుగాని విపరీతముగా నుండ నేరదుగదా!

ఇంతలోఁ, జిచ్చుఱుక నుంకించు శలభమువోలె మనోభ వుఁడు బాణప్రయోగావసరమును బ్రతీక్షించుచుఁ, బార్వతి సమక్షమున శివునియందు లక్ష్యముంచి నారిసారించుచుండెను. పార్వతియొసఁగిన పుష్కరబీజమాలను గైకొన మహేశుఁడు చేయిచాచినంత, నిదేయదనని యెంచి పంచసాయకుఁ డాతనిపై సమ్మోహనాస్త్రమును బ్రయోగించెను. దానిచేఁ జంద్రోదయ సమయమునఁ గల్లోలితమైన వారినిధివాడ్కి శివుఁ డించుక హృదయము చలింపఁ బార్వతిమోమువంక వీక్షించెను. అటు శివుఁడు పరికించినంత హైమవతి మేనెల్ల గగుర్పొడువ, శృంగారభావమును బ్రకటించుచు సిగ్గుచేఁ గన్నుల నిమీలన మొనర్చుచు నోరమోమిడెను. అంతఁ బరమేశుఁడు ధీరుఁ

డగుటచే హఠాత్సంభూతేంద్రియక్షోభ మడంచికొని, 'యిట్టి మనోవిక్రృతికిఁ గారణ మేమైయుండునా!' యని నలుఁగెలంకులఁ బరికించుచు, నాలీఢాసనస్థుఁడై వింట నమ్మొలసంధించి ప్రయోగింప నుంకించుచు నొకపొదరింట డాఁగియున్న మనోభవుని గాంచి, "ప్రభూ! కోపింపకుము కోపింపకు!' మని మింటనుండి దేవతలు మొఱలిడుచున్నంతలో, దుర్నిరీక్ష్యమగు తృతీయాక్షి వహ్నిజ్వాలచే నాతని భస్మావశేషు నొనరించి, స్త్రీసన్నిధానమును విడనాడ నంతర్ధానంబు నొందె. అంతట నతిదుస్సహమైన యీపరాభవముచే బ్రూన్పడి రతి మూర్ఛ మునింగెను. దాన భర్తృవ్యసన మించుకతడ వెఱుకపడకుండుటచే నప్పటికయ్యది కొంత మేలే యయ్యెను. పార్వతియు నుదారమైన జనకునిసంకల్పమును, మనోహరమైన తనశరీర లావణ్యమును వ్యర్థములయ్యెఁగదా యని విచారించుచు, సఖీ సమక్షమున సంభవించిన పరిభవమగుటచే లజ్జ మనమునఁ బెనఁగొన నిరుత్సాహయై యింటికిఁ బోయెను. అట్లు రుద్రుని సంరంభముచే భయమునంది వడవడ వడఁకుచు నింటికరుదెంచిన కూఁతుఁ గాంచి, హిమవంతుఁ డామెను దన కౌఁగిటఁ జేరఁదీసి భయంబుడిపి లోనికిం గొంపోయె.

---

# కుమారవిజయము

## చతుర్థ స్తబకము

## రతివిలాపము

—:o:—

పంచసాయకుఁడు ముక్కంటి కంటిమంట కాహుతి యైనయంతఁ బతికిఁగల్గిన దురవస్థ యెఱుఁగక శివునిసంరంభముచే మూర్ఛమునిఁగిన పూవిలుకానిరాణి యిప్పుడిప్పుడే మూర్ఛదేఱి కన్నులు తెఱచెను. దుర్భర వేదనాకలితమగు నవవైధవ్యము నామాయముదైవము తనతలపై మోపనున్నాఁడని పాప మామె కలయందైనఁ దలఁచియుండెనా! మూర్ఛలేచి నలుదెసలు గలయఁ జూచినది. ఏదియో యసంతృప్తి దృష్టికి గోచరించుచున్నదిగాని, ప్రాణనాయకుఁడు మాయమైపోయినాఁడని యెఱుఁగదాయమాయకురాలు. " జీవితేశ! యెట నుంటివి? నన్నొంటివిడిచి యెటకేఁగితివి? ఎందుడాఁగితి? " వని పలవించుచు లేచి చూచినంతఁ దనకట్టెదుటఁ బురుషాకృతితోనున్న హరకోపానల భస్మముమాత్రమే గోచరించెను. అంతనామె మరల దుఃఖమున మునిఁగి, యాభస్మరాశిని గౌఁగిలించుకొనుచుఁ, గేశకలాపము వీడి చిందఱవందఱ యగుచుండ, వనభూమియంతయుఁ దన్ననుసరించి శోకించుచున్నదా యనునట్లు విలపింపఁదొడఁగెను:

"మనోహర! విలాసవంతులకుఁగూడ నుపహాసభూతమైన నీనవలావణ్యశరీర మిట్టియవస్థ నొందియుండ నాయెడఁద యింకను ప్రీలకున్నది. స్త్రీ లెంత కఠినాత్ములు! తన్నాశ్రయించిన పద్మలతను వీడి గట్టుతెగి పాఱు ప్రవాహమువలె, నిన్నాశ్రయించి జీవించు నీయబలను వీడి, చిరకాలప్రణయమును వమ్మొనర్చి యెట కేఁగితివి! కలయుంనైన నాకొక యనిష్టము నీవాచరించియుండలేదు! నేను నీకెట్టి యప్రియమును నెన్నఁడుఁ జేసియుండలేదే! ఇట్లు నీకై వేయిగొంతులతో విలపించు ప్రాణప్రియను దర్శనమేల యొసఁగవు! గోత్రస్ఖలన మొనర్చిన నిన్ను బరిహాసమునకై మొలనూలిచే బంధించితినని కోపమూనియుంటివా! పుప్పొడి కన్నుల రాల నవతంసోత్పలము విసరియుంటినని కిన్కవహించితివా? 'రమణి! నీవు నిరంతరము నాహృదయనివాసినివై యుండుము' అని పల్కువాఁడవే! అది కేవలమసత్యము; కాకున్నచో, నీవనంగుఁడవై న న్నిట్లేల యేకాకినిఁ జేసి విడనాడియుందువు! అయినను నేనిసుమంతయు విచారింపను. ఏమనిన, నీవిప్పుడిప్పుడే పరలోకముల కేఁగియుంటివి; గాన నేనెట్లున నీవెనువెంటనే పయనించి నీయంకతలము నాశ్రయింతును. కాని, పాప మీలోకమును మాత్రము దైవము మోసపుచ్చినాఁడు. నీవులేకున్నచోఁ బ్రాణికి సుఖమెక్కడిది? నీశరీరము కథామాత్రావశేషమైపోయెనను వార్త విని, త్వత్ప్రియసఖుఁడగు కుసుమబాంధవుఁ 'జాతోన్మదయము వ్యర్థమయ్యెఁగదా!' యని విలపించుచు బహుళపక్షము

గతించినను దనశరీరకార్శ్యము నతికష్టముగా విడనాడును. హరితారుణచారువృంత సంశోభితమై, కోకిల కలకూజిత సంసూచితమైన యీ నవచూతప్రసూన మిఁక నెవరిబాణా సనము నాశ్రయింపఁగలదు! నీవు ధనుర్గుణముగా నుపయోగిం చెడి యీ గండుతుమ్మెదలబారు హృదయము గరఁగించు కరుణస్వనములచే నన్ననుసరించి రోదవెట్టుచున్నట్లున్నది! లోకమోహనమైన యీ దేహమును మరల నొకమాఱు దాల్చి, మధురాలాప చతురికయగు పికాంగనను దూతిగా నుపయోగింపవా! ప్రణయకలహములందు శిరమువంచి సవిలా సముగా నీవొనర్చిన యాప్రణామములు, నా గాఢోపగూహ నములు సంతతముఁ దలంపునకు వచ్చుచుండ నాహృదయ మునకు శాంతి యెట్లుకలుగును? నీవు స్వయముగా నాశరీరమున వసంతపుష్పాలంకార మొనర్చితివి! ఆ కుసుమమండనము వాడ నైనవాడలేదు. ఇంతలో నీమనోహరమూర్తి మాయమై పోయినదే! నాదక్షిణపాదమునఁ బారాణియిడుచున్న నీవు దేవతలునియోగించిన కారణమున నతిదారుణకృత్యము నిర్వ హించుటకై పయనించితివి. వామపాదమునందుఁగూడ లత్తుకపూయరాకుండుట ప్రాణప్రియుఁడవగు నీకు న్యాయమా! ఆ నందనారామములందు మోసకత్తెలగు తెఱగంటిపూవుఁ బోండ్లు నిన్ను వంచింపకుండఁ, జిచ్చుటికి త్రుటిలో నిన్నుఁ గూడఁగలను. "రతియంతటి సాధ్వి, ప్రాణప్రియుఁడును లావణ్యా మూర్తియు నగు భావజుఁడు లేనపుడు ప్రాణము లెట్లుదాల్చి

యున్న! ” దను నపవాదము నెట్లు తలమోయఁగలను! ఎన్ని కష్టములఁ బడినైన నీపాదపద్మములనే యాశ్రయింతు. హృదయేశ్వర! మృతశరీరమైన లేని నీకు నంత్యమండన మెట్లొనర్తు! ఆపాపపుదైవము నీదేహమును ప్రాణములను నొక్కమాఱే తనపొట్టఁ బెట్టుకొనెనే! మనోహరా! యంకతలమును జెఱకువిల్లలంకరింప, సమ్ములను సంకలుదీర్చుకొనుచు సహవాసి యగు వసంతునితో నాఁడు నాప్రియాలాపములు, నా మధుర స్మితావలోకనములు తలఁచుకొనినకొలఁది హృదయము ద్రవించిపోవుచున్నది. కుసుమాయుధముల నేకరించు నీప్రియ సుహృదుఁడగు వసంతమూర్తియు నేలొకో కన్పింపలేదు! అతఁడుగూడ నీవలె హరునికోపాగ్ని కాహుతి కాలేదుగద!”

అని విలపించు కుసుమాయుధపత్ని దీనాలాపము లాలించి, యామె ననునయించు నుద్దేశముతో వసంతుఁడు శరీరముఁదాల్చి రతియెదుట నిలువంబడియె. ఆతనిఁగాంచినంతనే రతిలతాంగి యెదఁదమోఁదుకొనుచు బిగ్గఱగా నేడ్వఁదొడఁగె. బంధులఁజూచినంతనే హృదయకవాటమును దెఱచుకొని దుఃఖ ప్రవాహము పొంగి పొరలిపోవునుగదా! అట్లుపొంగివచ్చు శోకము నాఁపుకొనలేక ముక్తకంఠయై యేడ్చియేడ్చి, కొంత వడికి నేదదేఱి యతనితో నిట్లనియె :

“ వసంత! నీప్రియమయస్యున కెట్టి యాపదవచ్చినదో చూడుము! ఆమనోహరశరీరము పిడికెఁడుబుగ్గి యైపోయినది!

దానినైనను జూచి సహింపలేక పవనుఁడు కణములుగాఁ జిమ్మి చిందఱవందఱ చేయుచున్నాఁడు. స్మర! ఇదుగో నీప్రియవయస్యుఁడగు వసంతుఁడు; నిన్నుజూచు కోరికతో వచ్చియున్నాఁడు; ఆతనికైన నొక్కమాఱు నీదర్శన మొసఁగుము. ప్రియాజనమందలి ప్రేమ చలింపవచ్చును గాని, సుహృదులయందలి యనురాగ మెప్పుడును జలింపదే! ఈవసంతుఁడు కెడగూడియున్నంత మాత్రమున సాయకములు కోమలములయ్యు, బిసతంతువే ధనుర్గుణమయ్యు లోకత్రయమును నీయాజ్ఞలో నుండునట్లు చేయువాఁడవే! వసంత! నీవయస్యున కిది కడసారిపయనము! ఇఁక మరలిరాఁడు! నేనుమాత్ర మిందుపలఁబడ మిగిలియున్నాను! ఆపాడుదైవము మాప్రేమానుబంధము చూడలేక జక్కవకవఁబోలు నీజంట నెడఁబాపినాఁడు. నాయనా! బంధుజనప్రయోజనముగా నీవు నీవయస్యునిల్లాలి కొకయుపకార మొనర్పుము. అగ్నిజ్వాల లొనర్చి వానిద్వారమున నన్ను నా నాథునియొద్ద కంపివేయుము. అబ్జబాంధవుఁ డస్తమించినంత ఛాయావధూటియాతని వెనువెంటనే వెడలిపోవునుగదా! కుముదబాంధవుఁడు నింగిఁబాసినంతఁ జంద్రిక యాతని వెన్నాడియే పోవునుగదా! ప్రాణనాథుఁ డెటకేఁగియున్న సతీలలామ కతనిపాదానుసరణమే శరణమని యచేతనములుగూడఁ జెప్పిచాటుచున్నవి. ఈ నాయెదుటనున్న హృదయేశుని భస్మరాశినే కవుఁగిలించుకొని నవపల్లవ నిర్మిత శయ్యాతలమునకుఁ బోలె నాశరీరము పావకజ్వాలల కర్పింతు. ఆర్య, నీవు మాప్రణయరంగముల

యందుఁ గుసుమాస్తరణములఁ గల్పించువాఁడవు. అంజలి ఘటించు నీదీనురాలి మొఱాలించి యిప్పుడుగూడ నీప్రియమైక సుహృదులకై చితి నేర్పఱుపుము. అందు నా దేహము నర్పింతును. జ్వాలలొసర్చ మలయానిల వీజనములచే క్షణమాత్రములో భస్మావశేషమగునట్లు త్వరితముగా మండింపఁ జేయుము. నావియోగమును గ్రమటికాలమైనను నీవయస్యుఁడు సహింపలేఁడని నీవెఱిఁగిన విషయమేగదా! మన్మరణానంతరమున మాయిద్దఱకుఁ గలిపి యేకనివాపాంజలి నొసఁగుము. ఆ నందవనీవాటికలందు నీవొసఁగినదానిని వేఱుచేయక మేమిద్దఱము నేకపాత్రలోఁ ద్రాసమొనర్తుము. మాధవ, నీవయస్యునకు నవచూతప్రసవమన నెంతయో ప్రియము. పారలౌకిక క్రియలొసర్చువేళ విలోల పల్లవాభిరామములైన సహకార కుసుమాంకురము లొసఁగుము."

అని యిట్లు దీనాలాపములతో విలపించి విలపించి, నాథునిఁ గలియవలయునని యత్యాతురతతో నాత్మదేహము నగ్నిజ్వాలల కాహుతిసేయ నున్ముఖియైన రతిదేవి యుద్యమము నీక్షించి, యశరీరవాణి జాలిపడి ప్రేమగదుర నిట్లుపలాలింపఁ దొడఁగె: "కుసుమాయుధపత్ని! సాహసింపకుము. అచిరకాలములోనే నీవు నీప్రాణనాథునిఁ గలియఁ గలవు. అతఁడు కర్మవశముచే నిట్లయిన్నాఁడు. ఒకప్పుడు నీప్రియుని బాణప్రయోగముచే హృదయము చలించి, బ్రహ్మకుఁ దన కూఁతురగు సర

స్వాతియందు మోహము జనించెను. అంత నాతఁడును మనో వికారము నడంచుకొని, నీనాథుని కొంటెతనమునకుఁ గోపించి "హరునేత్రాగ్నిజ్వాలల కాహుతి యయ్యెదవుగాక" యని పంచసాయకుని శపించెను. ఇంతకును విధిమీఱ నెవరికి శక్యము! "అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభ"మ్మను నుడిని గుర్తించుకొమ్ము. అటుపై ధర్మప్రజాపతి ప్రార్థింపఁగా నత నితో బ్రహ్మ "మహేశుఁడు పార్వతిని బరిణయుంబాడి సుఖ ముల నెప్పు డనుభవించునో, యప్పు డయ్యానంద పారవశ్య ముచే నాతఁడు మన్మథునకుఁ బూర్వదేహ మనుగ్రహించు." నని శాపవిమోచనావసరముగూడఁ బ్రసాదించెను. అశని పాతమునకు నమృతవర్షమునకుఁగూడ జితేంద్రియులైన మహా త్ములు జీవనదాయకములగు సంబుధరములును గదా సమర్థ ములు! కాన, కళ్యాణి! ప్రియాలింగన సౌఖ్యానందమునందఁ గల నీసుకుమారలావణ్యశరీరము నంతవఱకు నెట్టెటో భద్ర ముగాఁ గాపాడుము. గ్రీష్మమునఁ జండభానుని కిరణములచే నెండిపోయిన స్రోతస్విని ప్రావృడాలింగనముచేఁ బ్రవాహపూరిత యగునుగదా!" అని 'యిట్లొకానొక యదృశ్యరూపయగు నాకాశవాణి మరణాభిముఖియైన రతిప్రయత్నము మాన్ప, నా నమ్మకముచే వసంతుఁడును వయస్యనిట్లోదార్చెను. రతియు మరణోద్యమమును విడనాడి యొకింతకాలమునకు సేదదేఱి ప్రాణనాయకుని శాపవిమోచనదివసంబుల లెక్కిం చుచు నిముసమొక యుగముగా గడపుచుండెను.

# కుమారవిజయము

## పంచమ స్తబకము

# పార్వతి తపస్సు

—:o:—

తన ప్రయత్నమున కనుకూలముగాఁ గార్యకారియగు కుసుమసాయకుఁడు పరమేశుకంటిమంటలో శలభమైపోఁగా, వ్యర్థమనోరథయైన పార్వతి, తనయౌవనమును మనోహరరూపమును నిరర్థకములయ్యెఁగదా! యని తన దురదృష్టముఁ దలపోసికొని తన్నుదా నిందించుకొనఁజొచ్చెను. ప్రియోపలాలితమైనఁగదా సౌందర్యమునఫలమగును! ప్రియుఁడాదరింపనియందము, దయితు నాలింగనమునకు నోచుకొనని యౌవనాభిరామావయవ విన్యాసము నడవిఁగాచిన వెన్నెలగదా! ఎట్లైనను దన రూపలావణ్యములు సార్థకములుగా నొనర్పనెంచి పార్వతి శివుకరగ్రహణమునకై ఘోరతపంబైన నాచరించుటకు సంకల్పించెను. అట్టిలోకైకనాథుఁడగు పరమేశుఁపొందు వడయుటకును, అట్టియనన్యలభ్యమగు ప్రణయము ననుభవించుటకును ప్రయత్నాంతరములు నిష్ప్రయోజనములు గదా!

కుసుమసుకుమారయగు తనముద్దులపట్టి గిరీశలగ్నమానసయై యాత్మమనోరథము నీడేర్చుకొన నరణ్యమునఁ దపం

బాచరించు నాశయముతో నున్నదని యెఱిఁగి, మేనక కూఁతుఁ జేరఁబిలిచి కవుఁగిటఁ జేర్చి, యతిక్లేశసాధ్యమై మహామును లవలంబింపఁదగిన తపోమార్గమునుండి యామెహృదయము మరలించుటకై యిట్లని యుపదేశించెను: ‘తల్లీ! శిరీషకుసుమ పేశలమైన నీశరీరమెక్కడ? ఎట్టికష్టములనైన నోర్వఁగల మహర్షులొనరించు తపమెక్కడ? నీరెండతాఁకునఁ గసిగందు నీమృదుల దేహముతోఁ జండగభస్తి ప్రచండతాపములకు లెక్కచేయని కర్కశశరీరులగు మునులాచరించు ఘోరతపంబొనర్పఁ బూనుట యెంత వెఱ్ఱితనము! కాన నీప్రయత్నము మానుము. నవపల్లవ కోమలశరీరము నేల యిడుముల పాలొనరించెదవు? దుర్గమారణ్య భూములందుఁ దపంబొనర్చి పడరాని పాట్లేల పడవలయునమ్మా! తపంబొనర్పవలయునని నీకంతదృఢసంకల్పమున్నచో నరణ్యమునకే పోనేల? మనయింట శచిమొదలగు దేవతలెందఱో గలరు వారినారాధింపు.” మని యిటులెంతబోధించియు హైమవతీమనోనిశ్చయమును జనని మరలింపలేకపోయెను. స్థిరనిశ్చయులైన మహాధీరుల సంకల్పమును, నిమ్నాభిముఖమైన మహానదుల ప్రవాహము నెవ్వరడ్డగింపఁ గలరు!

అంత నొకప్పుడు పార్వతి తనమనోరథము నెఱింగియున్న తండ్రియొద్దఁ జెలికత్తియలముఖమున నరణ్యమునఁ దపమాచరించుట కనుజ్ఞ వేఁడుకొని, యాతనియనుమతి వడసి, హారములాదిగాఁగల భూషణములఁ బరిత్యజించి బాలారుణభాసమాన

వల్కలముల ధరియించి, మయూరాభిరామమగు గౌరీశిఖరము నకు వెడలెను. విలోలాలకములచేఁ బూర్వ మామెముఖ మె ట్లందము మీఱియుండెనో జడలచే నిప్పుడుగూడ నంత మనో హరమై యలరారెను. అలికులసంసర్గముననేగాక శైవలసంబం ధముచేఁ గూడఁ బద్మము ప్రకాశించునుగదా! రణన్మణికింకిణీ రశనా స్పర్శముననే జాజువాఱు కటిప్రదేశమునఁ గర్కశమై ప్రతిక్షణము రోమాంచమొదవించు మౌంజిని త్రిరావృత్త ముగా ధరియించి, కందుకక్రీడలకే యరుణిమవహించు కరపల్ల వమున నక్షసూత్రమును బొందుపఱచి, హంసతూలికా తల్ప మున శయనించువేళ జడనుండిరాలిన పూవుల యొత్తిడికే కసుగందు సుకుమారదేహమునకు బాహులత యుపధానం బుగాఁ గటికిరానేల శయనంబుగా నొనరించుకొనుచు, వ్రత దీక్షాపరాయణ యగుటచే మరల గ్రహింపవచ్చునను నూహతో విలాసచేష్టితములను లతలకడను, విలోలదృష్టిని హరిణాంగనల కడను దాఁచఁబెట్టి, జలసేచనములచే లతాకుడుంగములఁ బ్రోది సేయుచు, నీవారధాన్య మొసఁగి హరిణశాబకములఁ బెంచుచుఁ దపమాచరింప మొదలిడెను. అంత నొకనాఁడు శుచిస్నాతయై యగ్నికార్యము నెఱవేర్చి వల్కలసంశోభితాంగియై యున్న పార్వతిని దర్శించునభిలాషతో మహామునులందఱు నటకరుదెం చిరి. ధర్మవృద్ధులయెడ వయసు లెక్కకురాదుగదా! ఆమె యాతపోవనమం దడుగిడినది మొదలటివిరోధిసత్త్వము లన్నియుఁ దమపూర్వమత్సరము నుజ్జగించి, యన్యోన్యమైత్రితో

మెలఁగఁజొచ్చినవి. తరువులును లతలును వివిధఫలపుష్పముల నతిథుల కన్నివేళల నర్పించుచుండెను. పర్ణశాలాభ్యంతరమునఁ గాంచినను హోమాగ్నిహోత్రములు ప్రజ్వరిల్లుచుండెను. వనమంతయు నతిపవిత్రమై యొప్పారె.

ఎంతతపంబొనర్చినఁగాని తనమనోరథము సఫలము కాదని యెంచెనో, పార్వతి యంతకఠినతపంబొనర్పఁ బూనుకొని శరీరమార్దవముకూడ లెక్కచేయదయ్యెను. గ్రీష్మకాలపుఁగ్రొవ్వెండలలో, మండుచున్న యగ్నులమధ్య గూరుచుండి మోమున మొలకనవ్వొలయఁ దదేకదృష్టితో సూర్యునిఁగాంచుచుండెను. తపనాంశుమాలచే నభితప్తమైన యామెమోముదమ్మి కమలశోభనువహించెనేగాని యినుమంతయువసివాడలేదు. అతికోమలములగుటచే నేత్రాంతములుమాత్ర మొకింత నల్లనడినవి. ఇట్లు పంచాగ్నిమధ్యమునఁ దపంబొనరించు నాపార్వతి రవికిరణసంతప్తయై, గ్రీష్మాంతమందు,వర్షధారాసంసిక్తయై, యవనికాంతతోఁగూడ బాష్పములు వదలెను. వర్షకాలమందలి ప్రథమోదబిందువులామె కనురెప్పలయందుఁ గ్రుటికాలముండి జాఱి, యధరాఘాతమొనర్చి, యనంతరము వక్షముపైఁబడి చూర్ణమై, పిదప నటనుండి వలీభాగముల స్ఖాలిత్యమును బొంది చిరకాలమునకు నాభిదేశముఁ జేరినవి. జో'అని కురియువర్షములలోఁ బర్ణశాలవిడనాడి, కఠినశిలాతలముల శయనించుచు నాపార్వతియొనర్చు తపస్సునకుఁ దటిన్మయావలోకనములచే

యామినులు సాక్షిభూతములై యలరారినవి. హేమంతము ప్రవేశించినంతఁ గంతదఘ్నోదకంబుల నధివసించుచు, వియుక్తములై యొకదానికై యొకటి యెలుఁగిచ్చి యాక్రందన మొనర్చుచున్న చక్రవాకద్వంద్వములయెడ జాలిగొనుచు, నత్యంత హిమవదనిలప్రసారముగల రాత్రులఁ గడపుచుండెను. హేమంతరాత్రులందుఁ దుషారవర్షముచేఁ బద్మములయందమెడలినసరోవరములకు వనజగంధసంశోభితమై ప్రకంపమానాధరపత్ర విరాజమానమై యొప్పారు తనమోముదమ్మిచే సరోజసంధాన మొనర్చినట్లుండెను.

అయాచితముగ సంభవించు జలము, నమృతమయుఁడైన మృగాంకుని చంద్రికలు నామెకుఁ దొలుత నాహారములైనవి. తరువాతఁ గొంతకాలము తమకుఁదా రాలిన చెట్లయాకులోగిరంబుగాఁ గొని, యనంతరమున నయ్యవియుఁ బరిత్యజించి వాయుభక్షణ మొనర్చుచుఁ దపోదీక్షకుఁ బరమావధి నందెను. ఆకారణముననే యామెకు 'అపర్ణ'యను పేరు ప్రసిద్ధమయ్యెను. ఈవిధముగా ఘోరతపశ్చర్యలచే మృణాళపేశలంబగు శరీరమును గృశింపఁజేసిన పార్వతి, కఠినశరీరములు గల్గి తపంబొనర్చిన మహామునులకన్న మిన్నయై సర్వాధికంబగు యశస్సును గడించెను.

---

# కు మా ర వి జ య ము

## షష్ఠ స్తబకము

## తపఃఫలోదయము

——:o:——

అంత నొకవ్వాఁడు దండకమండలు కృష్ణాజినంబుల ధరియించి, మూర్తీభవించిన బ్రహ్మతేజమో యన, శరీరమును దాల్చిన బ్రహ్మచర్యమో యన నొకతపస్వి యయ్యాశ్రమ ప్రదేశమున కరుదెంచెను. అట్లేఁగుదెంచిన మునింగని పార్వతి సగౌరవముగా నెదుర్కొని, గంధపుష్పాక్షతాది పూజాద్రవ్యములచే నతనిఁ బూజించె. సమానులైనను వ్యక్తివిశేషములయం దతిగౌరవము గలుగక మానదుగదా! ఆ వటుప్రవరుఁడును యథావిధిగాఁ బార్వతియొసఁగిన సపర్యల స్వీకరించి, నిష్కల్మషములైన చూపులఁ బ్రసరింపఁజేయుచు నుచితక్రమముగా నిట్లు పల్కెను:

"బాలతపస్విని! హోమాదికార్యములకై సమిధలు కుశలు సులభముగా దొరకుచున్నవా? జలములు నిర్మలములై స్నానయోగ్యములై యున్నవా? శక్తినిమీఱక తపంబాచరించుచుంటివా? శరీరముగదా సకలధర్మములకుఁ బ్రధాన సాధనము! నీ కోమలహస్తములతోఁ బెంచిన లతలు చివురించుచున్నవా? నీచూపుల ననుకరించుటకుఁ బోలెఁ గన్నుల

నార్చుచుఁ జేతియందలి దర్భాగ్రముల నపహరించు హరిణ శాబకములపైఁ బ్రేమగలిగియుందువా? పార్వతి, 'సౌమ్య స్వరూపులు పాపకార్యము లొనరింప'రనువిషయ మెంతయు సమంజసము. నీశీలము మహామునులకుఁగూడ నాదర్శమై యుండుటయే యిందులకుఁ దార్కాణము. హిమవంతుఁడు నీపుట్టువుచేఁ బవిత్రుఁడును ధన్యుఁడు నయ్యె.

"ఇపుడు నీవొసఁగినసపర్యలందిన నన్ను గ్రొత్తవానిఁగా నెంచకుము. ఏమనిన 'సఖ్యము సాప్తపదీన'మని గదా! పెద్ద లందురు. ఈపరిచయముచే మనము సుహృదులమైతిమి. కనుక నతిప్రశాంతకల్యాణమూర్తివగు నిన్ను బ్రాహ్మణసహజ చాపల్యముచే నొక్కవిషయ మడుగఁదలఁచితిని. రహస్యము గాకున్న నెఱుకపఱచి నాయభిలషితము నెఱవేర్తువని నమ్ము చుంటి. ఇఁక నేనడుగఁదలఁచిన విషయమాలింపుము. ఆదిమ బ్రహ్మయొక్క వంశమున జన్మించి, ముల్లోకములయందలి యంద మొకచోఁజేర్చినవడువున నున్న శరీరముగల్గి, సమస్తై శ్వర్యములతోఁ దులదూఁగుచు, నవయౌవనాభిరామవైన నీవింతకంటె నేయధికప్రయోజన మభిలషించి యిట్లు ఘోరతపం బాచరించుచుంటివి? భర్తృపరాభూతలైన మానిను లయ్యని ష్టమును బాపుకొనుటకై యొకవేళ నిట్టితపంబాచరింతురు. బాగుగా నాలోచించినచో నయ్యదియు నీయెడ నసంభవ ముగాఁ గన్పట్టుచున్నదే! బాల! నీయాకృతిని బరికింప నెయ్య

దియో తగనిశోకముచేఁ బరాభూతమైనట్లు తోఁచుచున్నది. పితృగృహమున నట్టిశోక మెట్లుసంభవించును? పరులవలన నెద్దియైనఁ బరాభవము గల్గెనా! యని తలంచుటకును నవకాశ ములేదు. ఫణిఫణాగ్రరత్నముపైఁ జేయిచాఁప నెవఁడు సాహ సింపఁగలఁడు? లేఁతవయసునందుండఁదగిన రత్నాభరణముల నన్నిటిని బరిత్యజించి వార్ధకంబునఁ దాల్పఁదగు వల్కలముల నేల గట్టితివి? అమరలోకమును గాంక్షించియుంటివా? నీపుట్టి నింటి ప్రదేశములన్నియు దేవభూములగుటచే నీశ్రమయంతయుఁ గేవలము వ్యర్థము. అనుకూల వర కరగ్రహణమును గోరి యుంటివా? అందులకై తప మొనర్చుట యనవసరము. ఏమనిన, నెవ్వరైనను రత్నమునకై వెదకుకొంచు వత్తురుగాని, రత్న మింకొకరి నాశ్రయించుటకై వెదకుకొంచుఁ బోదుగదా!" అని తనయభీష్టమును గుఱుతించి నట్లాతఁడాడిన మాటల నాల కించి, యయ్యది యింతదనుక నెఱవేఱకుండుటచేఁ బార్వతి వేడినిట్టూర్పు విడిచెను. అంత నాతఁడామెహృదయమును గనిపెట్టి మరల నిట్లు పలుకఁదొడఁగెను:

"హైమవతి! దీర్ఘోష్ణనిశ్శ్వాసముచే నీమనోరథ మెద్దియో గ్రహించితిని. కాని యావిషయమై నాహృదయము కొంత సందేహమును మాత్ర మొందుచున్నది. అదియుఁగాక, లోక ములో నీవై కోరఁదగిన వరుఁడే గానరాఁడు. కోరినచో లభిం పకపోవుటెట్లు? నీవువరించిన యాయువకుఁ డెంతపాషాణహృద

యుఁడో గాని, కర్ణోత్పలశూన్యములైన గండభాగములందు శిథిలములై చింపఱవందఱ యగుచున్న విలోలాలకములు సంస్కారవిహీనములై యుండ, నింతకాలమేల యుపేక్షింపఁ గల్గెను? మునివ్రతములచేఁ గృశించి, యెండతాఁకున భూష ణాంకములు నల్లనడి, దివాసమయ చంద్రరేఖవలె నున్న నిన్నుగాంచినఁ జైతన్యముగల యెవ్వనిహృదయము ద్రవింప కుండును? కుటిలరోమాంచితములై చతురావలోకనంబులు గల నీకన్నుదోయి కింతవఱకుఁ దనమోముదమ్మిని గాన్పింపని యేవరుఁడెవ్వఁడో సౌందర్యాతిశయముచే గర్వించియున్నాఁ డని యూహింతు. పార్వతి, యెంతకాలమని ఘోరతపం బాచరించి యిట్లుపడరానిపాట్లు పడెదవు? చిరకాలార్జితమైన నాతపములో సగభాగము నీకై దారవోసెదను. దాన నీవు సఫలమనోరథవు కాఁగలవు. కాన నీవుకోరిన యేవరుఁడెవ్వఁడో యెఱిఁగింపుము." అని పల్కిన యాబ్రాహ్మణునిమాట లాలించి పార్వతి తనమనోరథము తనంతఁ దాఁ దెల్పుటకు లజ్జవడి, యావిషయ మెఱిఁగింపుమను నూహతోఁ జెంతనున్న చెలికత్తియమోమువంక గాంచెను.

అంత నామె యాద్విజన్ముని దిక్కుమొగంబై యిట్లు పల్కెను: " ఆర్య, ఆతపవారణమునకై యంభోజము నుప యోగించునట్లు, నాసఖి కుసుమకోమలశరీరమును తపస్సాధ నముగా నుపయోగించుటలోని కారణమాలింపఁ గుతూహ

లము గలదేని మనవి యొనర్తును సావధానచిత్తుఁడవై యాలిం పుము. ఈమె మహేంద్రాది దిక్పతుల లెక్క సేయక, రూప సంపదచే వశముగాని జితేంద్రియుఁడగు పినాకపాణిని బతిగాఁ గోరియున్నది. పూర్వమొకప్పుడు పరమేశుహుంకారముచే మరలివచ్చిన కుసుమసాయకుని శిలీముఖ మీయామె హృదయ మును బ్రవేశించెను. అయ్యది మొదలొక్కని, యెంతయు సంతా పమునందుచుఁ బితృగృహమునందలి మంచురాలయందుఁగూడ నిర్వృతిం గానక యిసుమంతయు నూఱటలేకయుండు. ఒక్కొ కప్పుడు, సంగీతసఖులగు కిన్నరరాజకన్యకలు కంటఁదడిపెట్టు నట్లు మాహైమవతి, సబాష్పకంఠస్ఖలితాక్షరయై, త్రిపురారి ప్రభావము నుగ్గడించుగీతిక లాలపించుచుండును. ఒక్కొక తఱి రాత్రులందు నిద్రకై మూసినకన్నుల వెనువెంటనే తెఱచి 'నీలకంఠ! యెటకుఁబోవుచుంటివి?' యని పలవించుచు శయ్యాతల మునుండి యులికిపడి లేచి, భావపరికల్పిత పరమేశు కంఠా లింగనమునకై బాహులతలఁ బ్రసరింపఁ జేయును. అఱచేతి యందుఁ జంద్రశేఖర స్వరూపము లిఖించి, 'నీవు సర్వలోక వాసివనియు, నిఖలప్రాణి హృదయముల నుందువనియు విద్వాం సులు పల్కుచుందురే! చిరకాలమునుండి నీకై పలవించుచున్న యీయబల నేల యూరార్పరా!' యని రహస్యమున నయ్యా కాను నధిక్షేపించుచుండును. జగదీశ్వరుఁడగు నా పరమేశ్వ రుని బరిణయమాడుట కుపాయాంతరము గానక, తండ్రియనుజ్ఞ వడసి యీయామె యిట్లు తపంబాచరించుచున్నది. ఇచట నీమె

హ స్తపల్లవములచే నభివర్ధితమ్ములైన లతాకుడుంగములు గూడఁ జివురులె త్తినవిగాని, మా చెలికత్తె మనోరథ మింతదనుకఁ బ్రరోహాభిముఖమైనఁ గాలేదు; ఫలాశనుగూర్చి చెప్ప నేల? కష్టతర మౌనిత్రతాచారములచేఁ గృశాంగియైన యీమెను గాంచినకొలఁది మా హృదయము నీరైపోవుచున్నది. అనావృష్టి పీడితావనికాంతను జలధరమూర్తివోలెఁ దన్నుగోరి యిన్ని యిడుమలఁ బడుచున్న మా ప్రాణసఖి నా మహేశుఁ డెప్పు డనుగ్రహించునో తెలియకున్నది.”

అని పార్వతీహృదయము నెఱిఁగిన యా చెలికత్తియ నివేదించిన భావము నాలించి, యా కుహనావటువు ‘తన్ను గూర్చియేగదా పార్వతి యిట్లు పరితపించుచున్న!’దని లోలోన సంతసించుచు, హర్ష చిహ్నముల నిసుమంతయు వెలిఁబుచ్చక ‘మానిని! యిది యథార్థమా? లేక పరిహాసజల్పితమా?’ యని యయ్యుమను బ్రశ్నించెను. అంత నాశైలతనయ కొంతదనుక మౌనముద్రను సహించి, యెట్టకేలకుఁ బలుక నుద్యమించి, జపమాలను జేత సవరించుచు: “విద్వద్వర! నీవిపుడు నాసఖీ ముఖమున నాలకించినవిధముగా నేను దలఁకుఁదగని పదవిని గోరుచున్నమాట సత్యమే. ఆమనోరథము నెఱవేఱుటకై యిట్లు తపంబాచరించుచున్నాను. కోరికలు స్వశక్తి పర్యాలోచనానుకూలముగా నుండవుగదా!” అని పల్కెను. ఈ మాటలు పార్వతీముఖమునుండి వెలువడినంత నాబ్రహ్మచారి

యాశ్చర్యచకితుఁడైనట్లు సాభిప్రాయముగా నీక్షించుచు, నెద్దియో యాలోచించి, మఱల నిట్లు పలుకనారంభించెను:

"హైమవతి! నీవువరించిన యామహేశు నే నెఱుంగుదు. ఇంతకుఁ బూర్వ మెవనిఁగోరి భగ్నమనోరథనైతివో, యాతనిఁ గూర్చియే మఱల నేల తపంబొనర్చుచుంటివి? అమంగళాభ్యాస రతుఁడగు నాతనిచర్యలఁ బరికించినచో నీవాతని ప్రణయము నకై యింత పరితపించుటయు నంత శ్లాఘనీయము గాదు. అదియుఁగాక నీయంతట నీవే యొక్కవిషయ మాలోచించు కొనుము. కలహంస లక్షణాంకితమైన మంగళవధూ దుకూల మునకును, శోణితబిందు వర్షియగు గజాజినమునకును సంయోగ మెట్లుసరిపడును? లాక్షారసాంకితములై, కుసుమాస్తృత దివ్య భవన సంచారయోగ్యములైన నీమృదుపాదములు, వికీర్ణ శవకేశ పరేత భూములయందు నడయాడుటకుఁ ద్వాదీయ శత్రువైన నంగీకరించునా? ఒకవేళ పరమేశు వక్షస్థలము నీకంత సులభసంప్రాప్తమే యైనను, గాఢోపగూహనావసర మున, హరిచందనాంకిత భవదీయోరస్థలము శ్మశానభస్మాంక ములచేఁ గళంకితమగునే! యింతకంటె నమంగళ మింకేమైనఁ గలదా? అంతవఱకుఁబోనేల! వివాహమైనవెంటనే నీకు సంభ వించెడు పరాభవమెట్టిదో యూహించితివా? మత్తగజేంద్ర మధిరోహించి యూరేఁగఁదగిన నీవు శివునితో ముసలియెద్దు నెక్కి పురమేఁగునంత నెల్లరు 'నేమి యీవింత!' యని పరిహా సింతురు. అదియుఁ గాక, కాంతిమతియగు చంద్రకళ యా

పశుపతి నాశ్రయించిన కారణమున నీవలెనే దయనీయావస్థను బొందియుండుట వీనులార విని కన్నులారఁ గాంచియుఁగూడ, సమస్తజన నేత్రకౌముదివగు నీవేల యతని నాశ్రయించి శోచనీయావస్థలో మునిఁగిపోవఁ దలపోయుచుంటివి? పోనీ, తాను వివాహమాడఁగోరిన వరునియందుఁ గన్యక కాంక్షించు లక్షణములైనను మహేశునందున్నవేమో యోజింపుము. సౌందర్యవంతుఁడందువా యాతని దేహము ప్రకృతివిరుద్ధముగా విరూపాక్షము. ఉన్నతవంశ సంజాతుఁడందువా యాతని యన్వయమెద్దియో తలిదండ్రులెవరో తెలియరాదు. పోనీ, యైశ్వర్యసంపన్నుఁడందువా కట్టబట్టయేని లేని దిగంబరుఁడు. కపాలము భిక్షాపాత్రగా, శ్మశానములు నివాసాగారములుగా, దిక్కులంబరముగా సన్న్యాసియై చరించు శివునకును, బంగరు గిన్నియలఁ బంచభక్ష్య పరమాన్నము లారగించుచుఁ, బరిచారికలు పాదములొత్తుచుండ హంసతూలికా తల్పమున శయనించుచు, పట్టువస్త్రముల ధరియించి, సుకుమార మహారాజ భోగము లనుభవించు పుణ్యాలక్షణాంచితవైన నీకును ఎన్ని యోజనముల దూరమున్నది! కనుక నామాటలాలించి యీ యుద్యమమునుండి మనసు మరలింపుము. శ్మశాననిక్షిప్త వధ్యశూలమును మహాజను లెన్నఁడైన యూపముగా నొనర్తురా?" అని యిట్లు తన యభిమతమునకు విరుద్ధముగా నిచ్చవచ్చిన తెఱఁగునఁ బ్రసంగించు నా ద్విజన్ముని మాటల కతికుపితయై పార్వతి యధరపల్లవము కంపించుచుండ, నుపాంతలోహితాకుంచిత భ్రూలతయై సావజ్ఞముగా నీక్షించుచు నతనితో నిట్లనియె:

"ఓయి! శివ్రుఁడన్న నేమో యెఱుఁగనివాఁడవగుటచే నిట్లు పల్కితివి. మూఢులలోకసామాన్యులైన మహాత్ముల చరితయందలి యాథార్థ్య మెఱుఁగలేక వారల నిందసేయు చుందురు. ఇంతవఱకు నీవాపరమేశుని గూర్చి యాడిన మాటలు కేవలము బుద్ధిమాంద్యముచే నీనోట వెలువడినవి గాని యథార్థ మెఱిఁగికాదు. ఆ చంద్రశేఖరుఁ డమంగళా భ్యాసరతుఁడనిగదా పల్కితివి! అనర్థప్రతీకారార్థులై యైశ్వర్య కాంక్షగలవారు గంధమాల్యాది మంగళద్రవ్యముల నలంక రించుకొందురే గాని, జగద్రక్షకుఁడై నిష్కాముఁడై యున్న యామహాత్మునకు వానితోఁ బ్రయోజనమేమి? నీచవస్తువు నేల కాంక్షించెద వని నన్నేమో యుపహసింప దొరఁకొంటివి. ఆ పినాకపాణి దరిద్రుఁడైనను లోకమునకు సంపద లనుగ్రహించు టలో సమర్థుఁడు; పితృవనవాసియయ్యుఁ ద్రిలోకనాథుఁడు; భయంకరాకారుఁడయ్యు మంగళప్రదుఁడు. అట్టి త్రిపురాంత కునా నీచవస్తువని పల్కుట! ఆసర్వజ్ఞుని ప్రభావ మెవ రెఱుఁగఁ గలరు? ఆయష్టమూర్తి రత్నభూషణము లలంకరించుకొన్నను సర్పములఁ దాల్చినను, గజాజినముగట్టినను దుకూలధారణ మొనర్చినను, కపాలపాణియైనను సరే లలితేందుశేఖరుఁడగు నాతని దివ్యస్వరూప మిట్టిదని యెవరు నిశ్చయింపఁ గలరు? అతఁడు శ్మశానభస్మధారియని పల్కితివిగాని యందలి పర మార్థమును గుర్తింపవైతివి. చితాభస్మరజంబుగూడ నామహా నీయుని పవిత్రశరీర సంసర్గముచేఁ బరిశుద్ధమగును. కనుక నే

తాండవాభినయ క్రియాచ్యుతమైన శివశరీరభస్మమును మహేంద్రాది దేవతలుగూడ శిరంబునఁ దాల్తురు. మహైశ్వర్య సంపన్నుఁడని పేరువడసిన యింద్రుఁడుగూడ, నైరావతారూఢుఁడై పయనించుచు, నావృషభవాహనుని గాంచినంతనే మకుటతట చుంబిత భూతలుఁడై యతని పాదములపైఁ బడి భక్తితో దండప్రణామము లాచరించు. అదియుఁ గాక, నీతో నాకీ వివాదప్రసంగ మెునర్పఁబనిలేదు. సర్వవిధముల నామహేశుఁడు నీవనినట్లే యుండునుగాక. నామన మాతనియందు లగ్నమై యున్నది. స్వేచ్ఛాప్రవృత్తిగలవారు లోకాభిప్రాయమును గణింపరుగదా!" అనిపలికి చెలికత్తియఁగాంచి "సఖి! యీబ్రహ్మచారి యింక నేదియో పలుకఁదలఁచినట్లు పెదవులు సవరించుచున్నాఁడు. మహాత్ముల దూషించువారే గాక వారి నిందాలాపము లాలించువారుగూడఁ బాపభాజనులగుదురు. ఈతని నావలికిఁ బంపివేయుము. లేదా నేనే యిటనుండి కదలి పోదును." అని పార్వతి యతిరయమున నచ్చోటు వీడిపోవ నుంకింపఁ, గపటవటువగు నావృషాంకుఁడు నిజరూపము దాల్చి నవ్వుచు నామెను జేయిపట్టి నిలువరించెను.

ఆ పూర్వపరిచితమైన యీశానుస్వరూపముఁ విలోకించినంత నాబాల యొడలెల్లఁ జెమటపట్టి వడఁకుచు, మార్గమధ్యమున నచలాకులితమగు నదీమతల్లివలె నచట నుండుటకుఁగాని ముందు కడుగిడుటకుఁగాని యశక్తయయ్యె. "లతాంగి, తపో

ద్రవ్యముచే నీకు నేనమ్ముడువోయితిని. ఈదివసంబు మొదలీదాసుని నీకటాక్షావలోకనములకుఁ బాత్రునిఁ జేయుము.' అని యాశివుఁడు పల్కినంత, హైమవతి తపోజనితక్లేశమంతయుఁ బోయి మహానంద తరంగ డోలికలఁ దేలియాడెను. కార్యము ఫలోన్ముఖమైనచోఁ బడినశ్రమయంతయు నొక్కత్రుటిలో మాయమైపోవును గదా!

---

# కుమారవిజయము

## సప్తమ స్తబకము

## హరకృతసప్తర్షిప్రస్థాపనము

——:o:——

ఆవిధమున మహాదేవుని యాదరము నందిన పార్వతి "అద్రినాథుఁడగు మదీయజనకుని యంగీకారమును బడసి, తద్దత్తనగు నన్ను బరిగ్రహించి యనుగ్రహింపు" మని సఖీముఖమున నేకాంతముగా శివునకు సందేశమంపెను. పరమేశుఁడు నటులేయొనర్తు నని హైమవతికిఁ బ్రతిసందేశ మంపి, యేతత్కార్య నిర్వహణమునకై జ్యోతిఃప్రభామండితులగు సప్తర్షులను దనహృదయమున నొకమాఱు స్మరించెను.

అంత, మందాకినీజలంబుల నవగాహ మొనర్చి, ముక్తాయజ్ఞోపవీత విరాజమానులై, హేమవల్కలములఁగట్టి, రత్నాక్షమాలికలఁ దాల్చి, నభోమండలమునఁ బయనించు నవసరమున లోకబాంధవుఁడగు నంశుమాలిచే వందనము లందికొనుచుఁ, బ్రభామండలముచే సూర్యమండలముఁ గూడఁ బ్రకాశింపఁజేయుచుఁ దపోధనులగు సప్తమహర్షులును నరుంధతీసహితులై యొక్కక్షణకాలములో మహాదేవునెదుట సాక్షాత్కరించిరి. పతిపాదార్పితలోచనయై యరుంధతి,

ప్రత్యక్షమైన తపస్సిద్ధియా యను తెఱంగున నామహర్షి మధ్యమున సాటిలేనికాంతిచే నొప్పారె.

మహేశుఁడు సప్తర్షులను అరుంధతిని సమానగౌరవముతో నాదరించెను. ఉత్తమచరిత్రగలవారు స్త్రీలైనను బురుషులైనను మాననీయులేగదా! పరమపతివ్రతా లలామయగు నరుంధతినిఁగాంచినంతనే చంద్రశేఖరునకు ధర్మపత్నీపరిగ్రహణమునం దాదరాభిమానము లధికము లగుచుండెను. ధర్మ్యములగు యాగాదిపుణ్యకర్మ లాచరించుటకుఁ బతివ్రతలగు ధర్మపత్నులేగదా ప్రధానకారణము! ధర్మాచరణకాంక్షచేనైన నీశ్వరుని హృదయము హైమవతిని బరిణయంబాడ నాతురపడుచున్నదను విషయము నెఱింగి పూర్వాపరాధభీతచిత్తుఁడగు ననంగుఁడు, పునరుజ్జీవనావకాశము గలదుగదా యని ప్రత్యాశాలింగిత స్వాంతుఁడై సమయము నిరీక్షించుచుండెను. అంత సాంగవేదప్రవక్తలగు నామహర్షులు హర్షరోమాంచితగాత్రులై మహాదేవునిఁ దగినవిధమున గౌరవించి యతనితో నిట్లని ప్రసంగించిరి:

" జగదీశ, సకలలోకములచే స్మరింపఁదగిన నీచే మేము స్మరింపఁబడిన కారణమున, సాంగోపాంగముగా మేమొనర్చిన వేదాధ్యయనము, యథావిధిగా నగ్నిహోత్రునకు మేమర్పించిన హవ్యము, చిరకాలమునుండి మేమొనర్చిన తపఃకలాపమును నేఁడుగదా ఫలవంతములైనవి ! నిన్నుఁ దలఁచుకొన్నంతమాత్రమున జనులు పవిత్రులగుచుండ, నీచే

స్మరింపఁబడినవారలు ధన్యులై సర్వోత్కృష్టు లగుటలో నాశ్చర్యమేమి? నీవిట్లు సంభావించుటచే మాజీవితములు ధన్యములైనవని తలంతుము. నీవు మమ్ము స్మరించుటచే మాకుఁగల్గిన యానందమును, అన్నిప్రాణులయంతరంగముల వసించు నీతో మనవిసేయనేల? దేవ, నీవు మాకుఁ బ్రత్యక్ష దర్శన మొసఁగినను, ఊహాగోచరమైన నీదివ్యస్వరూప మెఱుంగ నెంతవారము! కాన మమ్మనుగ్రహించి నానిజరూప మియ్యది యని మాకుఁగాన్పించి మమ్ముఁ గృతార్థులఁ జేయుము. మాసామాన్యచక్షువులకు గోచరించు నీమూర్తి సమస్తప్రపంచమును సృష్టించు బ్రహ్మస్వరూపమా? సృజించిన యా నిఖిలభువనములఁ బాలించు విష్ణుస్వరూపమా? లేక యాలోకముల నన్నిటిని యోగశక్తిచే లయింపఁజేయు మహేశ్వరరూపమా? దేవా, యతినిగూఢమై యతిదుర్గమంబైన నిజరూపనిరూపణం బటుండనిమ్ము. ఇప్పుడాప్రసంగమును దడవనేల? మమ్మిటకు రప్పించిన హేతు వెయ్యదియో, మాచే నిర్వహింపఁదగిన యాకార్యమెట్టిదో యాజ్ఞాపించి మమ్ము ధన్యుల నొనర్పుము." అనిపల్కు మహర్షులమాట లాలించి మహేశుఁడు చిఱునవ్వుతో వారి కిట్లనియె:

"మహర్షిసత్తములార! నేను స్వార్థపరాయణుఁడఁ గానని మీ రెఱిఁగిన విషయమేగదా! పరోపకారానుకూలముగా నెనిమిదిమూర్తులు ధరించిన నాపద్ధతియే యందులకు నిదర్శనము కాఁగలదు. అట్టినేను, తృష్ణాతురములగు చాతక

ములచే నంబుధరమువలె, శత్రుపరాభూతులైన దేవతలచేఁ బ్రార్థింపఁబడి, వారిమనోరథము నీడేర్చు సేనానాయకు నుత్పత్తికై పార్వతిని బరిణయమాడఁగోరి, తత్సంధాయకులుగా మిమ్మిటకు రప్పించితిని. కనుక మీరు నేనుగా నద్రిరాజుని బ్రార్థించి యీకార్యమును నిర్వహింపుఁడు. మీవంటి సత్పురుషులు యత్నించినకార్యము లెన్నఁడును వైకల్యము నొందనేరవు. సర్వప్రసిద్ధుఁడై యజ్ఞాంశభాగియై భూధురంధరుఁడని పేరువడసిన నగరాజుతోడిసంబంధమును సర్వవిధముల శ్లాఘనీయమై తనరారును. లోకమందలి సత్పురుషులందఱు మీరు రచించినధర్మశాస్త్రముల ననుసరించుచుండఁ, గన్యార్థమై హిమవంతునితోఁ జెప్పవలయు మాటలతీరు మీకు బోధింపఁబనిలేదు. పూజ్యురాలగు నరుంధతియు నిందు మీకనుకూలసాహాయ్య మొనర్చును. సాధారణముగా నిట్టి శుభసంధానములయందుఁ బురంధ్రులదేగదా ప్రాముఖ్యము! కాన మీరరుంధతీపురస్సరముగా హిమవత్పురంబగు నోషధిప్రస్థమునకు వెడలి కార్యసిద్ధి యొనర్చుకొని రండు. ఈ మహాకోశీప్రపాతప్రాంతమున మనము మరలఁ గలియుదుముగాక.” అని మహేశుఁడు పల్కినంత నా మునిమండలము మహాప్రసాదమని ప్రణవము నుచ్చరించుచు నీశ్వరుమనోరథము నీడేర్ప బయలువెడలెను. ఆదిమమునియగు నష్టమూర్తియు మునులతోఁ బల్కిన తెఱఁగున మహాకోశీ ప్రపాతమునకుఁ గుఱంగట నున్న యొకచఱియపైఁ గూరుచుండి వారిరాకకుఁ బ్రతీక్షించుచుండె.

---

# కు మా ర వి జ య ము

## అష్టమ స్తబకము

# ఉ మా ప్ర దా న ము

—:o:—

అంతసమ్మహర్షులు నీలాంబుద మాలాలంకృత నభోమండలమునఁ దటిత్ప్రభలువోలె మనోవేగముతోఁ బయనించుచుఁ, బరిశ్రాంత పథిక విద్యాధరులు నిదురించు సంతానక తరుచ్ఛాయల దాఁటి, నానావిధ కుసుమ మిళిత గంధవహాంకురములచే నొప్పారెడు బాహ్యోద్యానంబగు గంధమాదనంబతిక్రమించి, యంబరచుంబి సౌధమాలికాలంకృతమై, కల్పద్రుమ విలోల విటపాంశు పతాకాభిరామమై, మందాకినీ ప్రవాహ పరిపూరిత పరిఖా పరివేష్టితమై, పద్మరాగ మణి వినిర్మిత జ్వలితౌషధి నిరంతర ప్రకాశమాన ప్రాకారాభిరామమై, యక్షకింపురుషాది దేవగణ ప్రచారసంశోభిత చతుష్పథంబులం గల్గి, వనదేవతా పురభామినీ కటాక్ష విద్యుత్ ప్రభా భాసమానమై, ధనసంపదలచే నలకాపురిం గాల్దన్ని, నిరంతర యౌవన వయో విరాజమాన సుందర నాగరజనంబులచే నమరావతిం గేలిసేయుచు సకల సౌభాగ్య సంపదానందముల కాలవాలమై యొప్పారు నగరరాజంబగు నోషధిప్రస్థముం బ్రవేశించిరి. ఆపట్టణముఁ బరికించినంత నమరలోకప్రాప్తికై

చిరకాలము తపంబొనర్చుట కేవలము వ్యర్థముగదా యని తలపోయఁజొచ్చిరి.

అగ్నిజ్వాలలవలె నరుణజటామండితులై మందాకినీ ప్రవాహమందుఁ బ్రకాశించుచున్న సూర్యుని ప్రతిబింబపంక్తి వలె, యథావృద్ధపురస్సరముగా నభోమండలమునుండి యవత రించుచున్న యామునుల నల్లంతదూరముననే గాంచి, గంధము పుష్పములు నక్షతలు నాదిగాఁగల పూజాద్రవ్యములు నించిన బంగరుపళ్లెములు పాణిపల్లవముల ధరియించి మందమలయా నిలమునకుఁ గదలియాడు నూత్నపల్లవ కుసుమ విరాజమాన లగు లతామతల్లులవలె వసంతపుష్పాభరణ భూషితాంగులగు నిద్దఱుముద్దియలు తన్ననుసరించి వచ్చుచుండ, నద్రిరాజు గౌరవ వినయ సంభ్రమములు ముప్పిరిగొన నమ్మహామునుల నెదుర్కొని, యథావిధిగా సపర్యలొనరించి, యనంతరముసఁ దాన మార్గముఁజూపుచు వారలఁ దనయంతిపురికిం గొంపోయి, వేత్రాసనాసీనులఁగావించి, తదనుగృహీతుఁడై తాను నొక సామాన్యపీఠికనధివసించి, యంజలిఘటించి వారియాగమనము నిట్లు గొనియాడెను:

“మహర్షిసత్తములార! మేఘోదయములేని వర్షమువలెఁ, గుసుమోద్భవములేని ఫలోదయముపోడ్కిఁ జలుపనితలం పుగాఁ గల్గిన మీరాక నాకమితానందము నొదవించుచున్నది. మీసందర్శనముచే నామూఢత్వమంతయు నశించి జ్ఞానోదయ

దైవమా. పాతాళమునను నే స్వర్గమునకుఁ బోవు తెఱంగున నంత
సము నందుచున్నాఁడ. అనంతకాలము మొదలు ప్రాణులఁ బరి
శుద్ధులఁ జేయు తీర్థంబులవి. సత్పురుష పాదప్రక్షేపానంతరమునఁ
గదా యాప్రదేశంబులు పవిత్రమగును! ఇంతకుఁబూర్వము
నిత్యమైన గంగానదీప్రవాహము, నిప్పుడు మీపాదములు
గడిగిన పవిత్రోదకంబును దలందాల్చుటఁజేసి పరిశుద్ధుఁడనైతిని.
జంగమస్వరూపులగు మీపరిచర్యానుసక్తియు, స్థావరరూప
ముచే మీదర్శనాంకము నొందియు నిరుతెఱంగుల రూపము
లుండుటచేఁ దగినప్రయోజనము నేనాఁ డందఁగల్గితిని. దిగంత
వ్యాప్తములయ్యు నాయంగములు మీరాకచేఁగల్గిన యానం
దమును వహించుటకుఁ జాలకున్నవి. మీదర్శనప్రభామండల
ముచే నహంకారమందలి చీఁకటి యేగాక నాలోని రజోరూప
మగు నజ్ఞానమును గూడఁ బటాపంచలైనది. లోకములో
మీవంటి కోరఁదగిన ప్రయోజనమునుగాని, కోరినచోఁ గాకుండుట
గాని సంభవింపనేరదు. కేవలము నన్ను ధన్యునిఁ జేయుటకే
మీరిచ్చట దయచేసితిరని తలంచెదను. ఐన నీ మీ విధేయుఁడు
నిర్వహింపఁదగిన కార్యమేదైన నున్నచో నాజ్ఞాపింపుఁడు.
ప్రభువులయాజ్ఞ నెఱవేర్చుటయేగదా భృత్యులకు మహాప్రసా
దము. ధర్మపత్నీసమేతుఁడనగు నేను, మీసేవకురాలగు ఈ నా
ధర్మపత్ని, మదీయ ఏకజీవితమగు ఈ నా కన్నియ యీ
ముగ్గురలో మీకార్యము నిర్వహింపవలయు వారెవ్వరో యాజ్ఞా
పింపుఁడు." అని మనవిసేయు నాతనిమాటలు గుహాప్రవిష్ట

ములై ప్రతిధ్వనించుచుండ, హిమవంతుఁడు మరల నావిషయ
మునే యామ్రేడిత మొనర్చుచున్నట్లుండెను.

అంతఁ దక్షిణమును లిట్టిప్రసంగములయందు దిట్టయగు
నంగిరసునిఁ దమరాకకుఁ గారణము దెల్పుఁడని ప్రేరణమొసర్ప
నాతఁడు హిమవంతునితో నిట్లనియె: "అద్రిరాజ, యిపుడు
నీవాడినమాటలకన్న నెక్కుడౌదార్యవంతుఁడవు. నీ హృద
యమును శరీరమును సమానోన్నతములు. ఎన్నియో ప్రాణుల
కాధారభూతమగుటవలన నీ స్థావర స్వరూపమును విష్ణువుగాఁ
బెద్దలు పేర్కొందురు. పాతాళతలమునుండి నీవుద్ధరింపకున్నచోఁ
దామరతూండ్లవంటి మృదువైన ఫణాగ్రములచే నాదిశేషుఁడు
భూమిని మోయుట యసంభవమే యగును. అవిచ్ఛిన్నామల
ప్రవాహపూరితములైన భవదీయ గంగాది పుణ్యనదీమతల్లు
లును, సప్తవారాన్నిధి పారంగతములైన త్వదీయ యశశ్చంద్రి
కలును లోకముల నన్నిటిని బవిత్రముల నొనర్చుచున్నవి.
ఎన్నఁడో త్రివిక్రమరూపము ధరియించినసమయమునమాత్రము
హరికి సర్వవ్యాపకత్వము గల్గినది. నీకన్ననో, యయ్యది
స్వాభావికముగా నాదినుండియు నున్నదే. భవదీయ స్థావర
స్వరూపము పర్వతమయమై లోకమునకుఁ బట్టనికోటవలె
నున్నది. జంగమాత్మకమైన త్వదీయస్వరూపము భక్తవిన
మ్రమై సత్పురుషారాధనమునకుఁ దగియున్నది. ఇరువెఱఁగు
లగు నీరూపము లోకమున కెన్నివిధముల నుపయోగపడు

చున్నదో కాని యూహించుట కలవిగాదు. ఇట్టి నీయొద్దకు మేమరు
దెంచుటకు హేతువాలింపుము. ఆ ప్రయోజనముమాత్రము
నీకే చెందియుండును. శ్రేయంబుల నుపదేశించుటవలన
మేమింత భాగభాజనులముమాత్రము కాఁగలమేమో!

అణిమాది గుణోపేతమై యన్యపురుషులకుఁ జెందని యీశ్వరనామమును ధరించి, జటాలంకృతార్ధచంద్రుఁడై, పరస్పర సహకారయుక్తములైన పృథివ్యాద్యష్టమూర్తుల స్వరూపముతో నీ జగమంతయు వ్యాపించి, గాఢసమాధినిమగ్నులగు యోగీంద్రులచే నారాధింపఁబడుచుఁ, బునరావృత్తిరహితమైన మోక్షసామ్రాజ్యపదవిఁ గాంక్షించు విద్వాంసులచే సేవింపఁబడుచున్న జగత్కర్మసాక్షియగు మహేశ్వరుఁడు సమస్తలోకోపకారకమగు దేవకార్యమును నిర్వహించు సేనానాథుం బడయుటకై, నీ కూఁతుఁ బరిణయమాడఁగోరి మమ్మిట కంపినాఁడు. వాక్కునకు నర్థమువలె నీకన్నియతో మహేశుని సంఘటింపఁ జేయుము. ఉత్తమపురుషునకు నొసఁగినఁగదా కూఁతులఁ గన్నవారి కేవిధములైన విచారములు లేకయుండు. అట్టివాని కర్పించిన కన్నియయు సాటిలేనిసౌఖ్యము లందును. అది గాంచి సంతోషించుటయేగదా కన్యావంతులకుఁ బరమప్రయోజనము. జగజ్జనకుఁడగు నాతనిఁ జేఁబట్టి యీచరాచర ప్రాణికోటికంతకు నీ దుహిత మాతృస్థాన మలంకరింపఁజూచు వేడుక యెంతధన్యుఁడవోగాని నీకు సంభవింపనున్నది. దేవలోకమంతయుఁ దొలుత మహేశుపాదములకు వందనములొనర్చి,

యనంతరమున నాత్మీయ చూడామణి ప్రభాపటలిచే నీకొమరిత పాదాంగుళి నఖముల నరుణారుణము లొనర్చుచుండఁ గాంచి యానందించు భాగ్య మెంతటి మహనీయుఁడవో నీకుఁ గలుగనున్నది. పరిణేయకన్యకయా తపస్సిద్ధినడసిన పార్వతి; కన్యాదాన మొసఁగువాఁడా సమస్తపర్వతాధిపతివగు నీవు; యాచించువారా మేము; పరిగ్రహించువాఁడా సర్వజగన్నాయకుఁడగు మహేశ్వరుఁడు. నీ వంశౌన్నత్యముఁ బ్రకటింప నింతకంటె నెక్కుడు వస్తుసమూహముగాని, సమయముగాని యింకేమిగలదు! లోక మొనర్చు స్తోత్రముల నందుకొనువాఁడే గాని యొకరిని స్తుతింపనివాఁడై, యొకరొనర్చు ప్రణామము లంగీకరించువాఁడేగాని యితరులకు వందనము లర్పింపనివాఁడైన యాలోకగురునకు సుతాసంబంధముచే నీవు గురుఁడవు కాఁగలవు."

ఇంతదనుకఁ దల్లిచెంగట నాసీనయై తలవాంచి దేవర్షులమాట లాలించుచున్న పార్వతి, తన భాగ్యోదయ యాశంసచేఁ గల్గిన యానందమును లీలాకమల పత్రగణన వ్యాజమునఁ గోపనంబొనర్చుచుండెను. హిమవంతుఁడు మహేశునకుఁ దనకూఁతు నొసఁగి పరిణయ మొనర్చుటలో సర్వవిధముల నంగీకారము గలవాఁడయ్యు, సమీపముననున్న మేనక యభిప్రాయము నెఱుఁగునుద్దేశముతో నామె మోమువంక వీక్షించెను. సాధారణముగాఁ, గన్యాప్రదానము నిర్ణయించు పట్ల గృహస్థులకు ధర్మపత్నులేగదా నేత్రములు. మేనయు

నాథునభీప్సితమే సర్వోత్తమమైనదిగా తనయంగీకారమును సూచించెను. పతివ్రతలగు కులకాంతలు పతియిష్టమునకుఁ బ్రతికూలముగా నుండ నేరరు గదా!

అంత నా హిమశైలయుఁడు మహర్షులకెట్టి ప్రత్యుత్తర మొసఁగుట సమంజసమని యాలోచించి, మంగళాలంకృతయగు కూఁతు నంకతలమునఁ గూర్చుండఁబెట్టుకొని, నటన్నిటలాల కంబుల నపనించుచు "తల్లీ! తపోధనులగు మహర్షులర్థింప నిన్నాలోకనాథుఁడగు మహేశునకు నొసఁగి తగినగృహమేధి ఫలము నందితిని." అని పార్వతితోఁ బల్కి మునులదిక్కు గాంచి "మహర్షులార, యీశ్వరు ధర్మపత్ని మీకు నమస్కార మొనర్చుచున్నది యాశీర్వదింపుఁ"డని యంజలి ఘటించెను. ఆత్మేప్సితార్థ క్రియానుకూలాలాపుఁడగు నద్రిరాజు నౌన్నత్య మును గొనియాడుచు నామునిమండలము భావిశుభోదయాను కూలముగాఁ బార్వతి నాశీర్వదించెను. లజ్జాయత్తచిత్తయై సువర్ణకుండలములు కపోలతలములఁ దాండవింప నమస్కరింప నచ్చుచున్న హైమవతిని, అరుంధతి తనయంకతలమున నాసీనం జేసి యాశీస్సులు పల్కి చెక్కులుముద్దాడి, దుహితృస్నేహ విక్లబయై కంటనీరొత్తుచున్న మేనకను, అనన్యపూర్వుఁడగు మహేశుని మృత్యుంజయత్వాది గుణములను స్మరణకుఁ దెచ్చి యోదార్చెను.

అంత సప్తమహర్షులు "నేఁటికి నాల్గవనాఁడు వివాహ యోగ్య శుభదివసం"బని హిమవంతున కెఱిఁగించి, యాతఁ

డొనర్చిన సపర్యలందుకొని, మనోవేగంబునఁ బయనించి మహా కోశీ ప్రపాతప్రాంతమున నున్న మహేశుదర్శించి, పోయివచ్చిన కార్యము సఫలమగుట యెఱిఁగించి, యాతనివలన నామంత్రణంబు వడసి తమతమ నెలవులఁ జేరఁబోయిరి. ఆమాట లాలించిన యర్ధేందుశేఖరుఁడు హైమవతీకరగ్రహణమున కువ్విళ్ళూరుచు, నాదివసములు కొన్నికల్పములుగా గడిపెను. స్మరశాసనుఁడగు మహేశునే యింద్రియగ్రామ మట్లు కలఁతవెట్టుచుండ, సామాన్యులగు నితరుల నెవరిని దనకు దాసానుదాసులఁగాఁ జేసికొనదు!

---

# కుమారవిజయము

## నవమ స్తబకము

## పరిణయసన్నాహము

——:o:——

లోకమంతయుఁ జంద్రికా సుధాప్రహ్లాదములోఁ దేలి యాడు యామినులుగల దివసంబులలో, సర్వశుభగుణములతోఁ గూడిన యొకసుముహూర్తమున, నద్రిరాజు సమస్త బంధుజన సహితముగాఁ గూఁతువివాహదీక్షాకార్యములఁ జేయ మొదలిడెను. రాజకుటుంబమునందలి యాదరముచే నేయింటఁ జూచినను ముత్తైదువలందఱుఁ గూరిమిదైవాఱఁ బెండ్లిపనులనే చేయ మొదలిడిరి. ఈసంబంధముచే రాజాంతఃపురమును బుర కాంతలును నొక్కకుటుంబముగా మెలఁగఁజొచ్చిరి.

మందారకుసుములఁ జల్లి, పట్టువస్త్రములచే నిర్మింపఁ బడిన ధ్వజపంక్తుల నెలకొల్పి, కాంచనతోరణములఁ గట్టి, కదళీస్తంభములఁ బాదుకొల్పి పట్టణమంతయుఁ గైసేసిరి. ఇట్లు పెండ్లికై యలంకరింపఁబడిన యా యోషధిప్రస్థము స్థలాంత రమున నిర్మింపఁబడిన యమరావతివలెఁ బ్రకాశించుచుండెను.

సగరాజదంపతులు బహుపుత్రవంతులయ్యు వివాహము సన్నిహితమగుటచేఁ బార్వతిని మాత్రము ప్రాణసమానముగాఁ

జూచుచుండిరి. బంధుజనులందఱును పార్వతి నొకరియంకము నుండి మఱియొకరియంకమున నాసీనం గావించుకొనుచు, నొకరికంటె నొక రెక్కువ మణిభూష లర్పించుచు, దీనస లిడుచుం దమసంతానముకన్న నెక్కువ గారాబముతోం జూచు చుండిరి. అంతం జంద్రుం డుత్తరఫల్గునితోం గూడిన యొకనాంటి మిత్రదైవతాక ముహూర్తమునం దెల్లని యావాలును దూర్వాం కురములును దలపై నిడి, రాజవివాహలక్షణముగా ఖడ్గమును జేతియందుంచి, కౌశేయమును గట్టంబెట్టి సంతానవతులగు ముత్తైదువలా పార్వతిని మంగళాలంకృతను గావించిరి. వివాహ దీక్షకుం జిహ్నమగు సాయకమును జివురుంగేలంగీలుకొల్పిన యాబాల, శుక్లపక్షపుం దొలినాళ్ళలో సూర్యకిరణములచే సభి వృద్ధినందుచున్న బాలశశిరేఖను బోలియుండెను. కొందఱు కాంతలు లొద్ధచూర్ణముతో నలుంగు వెట్టి, స్నానయోగ్యమగు వస్త్రమును గట్టంబెట్టి యాహైమవతిని జతుస్తంభమండితమై, నైదూర్యశిలావినిర్మితమైన ముత్యాలజలశాలకుం గొంపోయి, వాద్యములు మ్రోంగుచుండ బంగరుకలశలందలి పన్నీట మంగళస్నానము చేయించిరి. స్నానమాడి ధౌతవస్త్రమును గట్టిన యయ్యువు, వానవెలిసినంతనే వికసించిన తెల్లని రెల్లు పూలచే నొప్పారెడు భూకాంతవలెం బ్రకాశించుచుండెను.

స్నానానంతరమున, వివాహమండపమందలి మణిస్తంభ చతుష్టయ విరాజమానమై కౌశేయ వితానాలంకృతమైన

కల్యాణవేదిపైఁ బార్వతిని దూరుపుమోముగాఁ గూరుచుండఁ జేసి సీమంతినులు, అలంకారవస్తుసమూహము సిద్ధముగా నుంచియుఁ దదీయ సహజలావణ్యముచేఁ గన్నులు మిఱుమిట్లు గొనఁ దదేకదృష్టితో నామెను బరికించుచు, నెట్టయెదుట నొక్కత్రుటికాల మట్టె నిలువంబడిరి. ఒక్కలతాంగి, సాంబ్రాణి ధూపముచే నామె కేశకలాపము తడియార్ప, వేఱొకమించుఁ బోఁడి, చెదరిన శిరోజముల ముడివైచి దూర్వాంకురములతోఁ గూర్చికట్టిన తెల్లనియిప్పపూమాల నలంకరించెను. కొండొక ముత్తైదువ, మెయినిండఁ దెల్లనిచందనపుఁబూఁత పూసి గోరోచనముచేఁ బత్రభంగములఁ దీర్చిదిద్దెను. నీలాలకములచే నామె నెమ్మోగము తుమ్మెదలతోఁగూడిన నెత్తమ్మివిలాసమును మించి, యంబుధర రేఖతోఁ గూడిన శశికళాలావణ్యము నతిక్రమించి సాటిలేని కళలతో నొప్పారెను. గోరోచనముచే నరుణారుణమైన యామెగండయుగళమందుఁ జెవిసందులనుండి వ్రేలుచున్న పాండురయవాంకురము ప్రేక్షకదృష్టుల నాకర్షించుచుండెను. ఒకకాంత, భావిప్రణయానురాగసూచకముగా నామె యధరపల్లవమున లత్తుక పూయుచుండ, వేఱొకతన్వంగి, పాదములకుఁ బారాణి యిడుచుండెను. అప్పుడువిచ్చిన కలువల వలెఁ దళుకులీను నామెకన్నులఁ గాంచి, ప్రసాధికలు కాంతి విశేషము గ్రహింపదని యెఱిఁగియు మంగళసూచకమని కాలాంజనమిడిరి. ఇట్లు మంగళాలంకారములచేఁ గై సేయఁబడిన యద్రిసుత సిందూరఁబూసిన లతాలతాంగి మాడ్కిఁ, దారకా మండలముచేఁబ్రకాశించు యామినీకాంతవలెఁ, గలహంసలచేఁ

గలకలలాడుచున్న సరిల్లలామపోల్కి నపూర్వకాంతిచే నొప్పా రెను. అలంకృతమైన తనరూపము నద్దమునఁ జూచుకొని, మురియుచు హైమవతి హరుకరగ్రహణమున కాతురపడుచుండెను. కాంతలయలంకారము ప్రియాలోక ప్రయోజనముగదా!

అంత జననియగు మేనక యానంద బాష్పములు కన్నుల నలముకొన, నరిదళముతో మనశ్శిలను బొందుపఱచి, యౌవన ముదయించినది మొదలు పార్వతికిఁగల్గిన మనోరథ మునకుఁ బ్రయోజనంబగు వివాహమునకుఁ జిహ్నగా నామె మోమునఁ దిలకంబిడి, యూర్ణామయంబగు సూత్రమును మణి బంధమున ముడివైచెను. క్రొత్తదుకూలమును గట్టుకొని, యాదర్శమును ముందిడుకొని తనరూపమును జూచుకొనుచున్న యాపార్వతి, నురుగుతోఁగూడిన పాలవెల్లివలె, లేఁతవెన్నెలతోఁగూడిన శరద్రాత్రివలెఁ బ్రకాశించుచుండెను.

అలంకరణమైనపిదప జనని తనయచేఁ గులదేవతలపూజ లొనరింపఁజేసి, ముత్తైదువల పాదములకు మ్రొక్కించెను. వందనములొనర్చిన పార్వతిని సీమంతినులందఱు "నవిచ్ఛిన్నమగు పతిప్రేమ నందు" మని యాశీర్వదించిరి. వివాహమైన యచిరకాలముననే శివశరీరార్ధభాగము నందిన యామె వారాశీర్వచించిన దానికన్న నెక్కుడు ప్రయోజనమునందెను.

ఇట్లు హిమవంతుఁ డుత్సాహైశ్వర్యానురూపముగా వివాహానుకూల కృత్యముల నన్నిటిని బూర్తియొనర్చి, బంధుజనసహితుఁడై హరాగమనమును బ్రతీక్షించుచుండెను.

---

# కుమారవిజయము

## దశమ స్తబకము

## పాణిగ్రహణము

—:o:—

గౌరి నలంకరించు సమయముననే, బ్రాహ్మి మొదలగు సప్తమాతృకలును కైలాసమునకు వెడలి, పరమేశునిఁ గూడ సుమంగళాలంకృతునిఁ గావింప మండనయోగ్యమగు వస్తుజాలము నాతనియెదుట నుంచిరి. మహేశ్వరుఁడు నలంకరించుకొనుట దనకిచ్చ లేకున్నను వారియందలి గౌరవభావముచే మంగళద్రవ్యముల నన్నిటి నొక్కమాఱు హస్తతలముతో స్పృశించెను. అంత నతనిసహజవేషమే వివాహప్రసాధనముగా మాఱెను. ఒడలి నున్న విభూతియే తెల్లని గంధపుఁబూఁత యయ్యె. బ్రహ్మ కపాలమే శిరోభూషణశోభను వహించెను. శోణితబిందువుల వర్షించు గజాజినమే కలహంసచిహ్నితమైన దుకూలమయ్యె. కనీనికా సంశోభితమైననిటలాక్షియే ఫాలతిలకమయ్యె. ఫణ రత్నకాంతులతో విరాజిల్లు భుజంగములే మణిబంధాది ప్రదేశ ములందుఁ గంకణాద్యాభరణములయ్యె. నిరంతరము చల్లని కాంతుల వెదచల్లుచుఁ గలంకములేని చంద్రరేఖయే చూడా మణియయ్యె. ఇట్లు పరమేశ్వరుఁ డపూర్వమండనాలంకృతుఁడై, ప్రమథులు గొనివచ్చిన ఖడ్గమునందు వీరపురుషాచారముగాఁ

దన ప్రతిబింబమును జూచుకొనెను. అనంతరము నంది కైదండ యొసఁగ శార్దూలచర్మాచ్ఛాదితంబగు వృషభము నధిరోహించి యోషధిప్రస్థమునకు బయలువెడలెను. వాహనప్రకంపముచేఁ గదలుచున్న కుండలములకాంతులు చెక్కిళ్లఁ జౌకళింప, నరుణాననములచే నంతరిక్షమునకుఁ బద్మాకరశోభ నాపాదించుచు సప్తమాతృక లాతనివెంట నేఁగిరి. కపాలాభరణముల నలంకరించుకొని మహాకాళి వారివెన్క నేఁగెను. ప్రమథగణంబులు జయజయధ్వను లొనర్చుచుఁ దూర్యారావములు మిన్నుముట్ట నావెన్క బయల్వెడలెను.

ఇట్లు మహేశుఁడు వివాహసన్నద్ధుఁడై హిమవన్నగరమునకుఁ దరలివెడలుచుండ, మంగళవాద్యనాదము లాలించి దేవతలును మునులును శివసేవావసరము గుర్తించి యటకు వచ్చిరి. అందు సహస్రాంశుఁడు, విశ్వకర్మ నూత్నముగా నిర్మించిన యాతపత్రమును బట్టఁ, దద్దుకూలాసన్న మాళియగు పరమేశ్వరుఁడమరనదీప్రవాహము తనజటాజూటమునఁ బడు నప్పటిశోభను వహించెను. గంగాయమునలు మూర్తుల ధరియించి వింజామరలు పూని యిందుమౌళి కిరువంకల వీచుచుండిరి. లోకస్రష్టయగు బ్రహ్మయు, జగత్పాలకుఁడగు శ్రీవత్సలాంఛనుఁడును జయశబ్దోచ్చారణ మొనర్చుచుఁ, ద్రినేత్రుని మహిమను బొగడుచుండిరి. ఇంద్రుఁడాదిగాఁగల దేవత లైశ్వర్యచిహ్నములైన ఛత్రచామరాదులఁ విడనాడి,

వినీతవేషులై, హస్తచాలనాది సంజ్ఞలచేఁ దమరాక నెఱిఁగింప నందీశుని వేఁడుకొని, తన్నివేదితులై యంజలి ఘటించి యీశానునకు వందనము లొనర్చిరి.

ఇట్లు తనకు సేవలొనర్చు దేవతలఁగాంచి శివుఁడు పద్మసంభవుని శిరశ్చాలనమున గౌరవించి, శ్రీపతిని మాటలఁ బలుకరించి, యమరేంద్రుని మందస్మితమున సంభావించి, దృష్టి ప్రసారమాత్రమునఁ దక్కుంగల దేవబృందము నాదరించి, తన్నాశీర్వదించుచున్న మహర్షుల దిక్కు మొగంబై "మునీంద్రులార, కానున్న వివాహయజ్ఞమునకు ఋత్విజులుగా మిమ్మితఃపూర్వమే కోరియుంటి" నని చిఱునవ్వుతోఁ బల్కెను. విశ్వావసుఁడాదిగాఁ గల గంధర్వగాయకులు త్రిపురవిజయ గాథాంచిత గీతికల వీణియలపై నాలపించుచుండఁ, గ్వణచ్చామీకర కింకిణీ ప్రభలు వెలుఁగొందు వృషభ వాహనంబుపైఁ బయనించి, కౌతుకముచేఁ బౌరులెల్లరు వీక్షించుచుండ నాకసమునుండి క్రిందికి దిగినంత, గిరిచక్రవర్తి వస్త్రాలంకారాది భూషితులైన బంధుజనములతోఁ గూడి, పరమేశు నెదుర్కొని, సపరివారముగా నాతనిని బట్టణమునకుఁ గొంపోయెను. కవాటములు తెఱచియున్న పురద్వారమును బ్రవేశించుచున్న యా మహేశ మహీధరుల బంధువర్గము లేక సేతువునుజీల్చుకొని పోవుచున్న రెండుప్రవాహములవలెఁ జూపఱకుఁ గన్నులపండువు నొదవించుచుండెను. అంతఁ ద్రైలోక్యవంద్యుఁడగు పరమేశ్వరుఁడు

నమస్కరింప, మహాదేవ సమీపమునమాత్రము తా నల్పుఁడగుటచే హిమవంతుఁడు కొంతసందియముతో నావందన మందుకొనియె. లోకనాథుఁడు తనకల్లుఁడు గానున్నందులకుఁ గల్గినసంతసముచే మిన్నంది, యయ్యానంద వికాసలక్ష్మి మోమునఁ దాండవింప, నద్రిరాజు పురోగామియై పరమేశుని ఆగుల్ఫవికీర్ణ పుష్పంబగు రాజమార్గమునఁ దనమందిరమునకుఁ దోడ్కొని యేఁగుచుండెను.

ఆసమయమున శివునిఁ జూచుకుతూహలముతోఁ బుర కాంతలు తక్కినపనులెల్ల విడనాడి ప్రాసాదపంక్తు లధిరోహించుచుండిరి. ఒక పౌరభామిని, సగముముడిచిన కేశపాశ మందలి కుసుమములు జాఱుచుండ, నొకహస్తముతో వేణీబంధమును ధరియించి గవాక్షముకడఁ జేరుచుండెను. వేఱొక కాంత, పారాణియిడుచున్న ప్రసాధికహస్తములనుండి యలంకారమధ్యముననే పాదము లాగికొని యమందగమనయై గవాక్షపర్యంత మార్గమును లాక్షారసాంకిత మొనర్పుచుండెను. కొండొకలతాంగి, కుడికంటికిఁ గాలాంజనమిడి యెడమకంటికిఁ గాటుక నిడకుండఁగనే, యంజనశలాక నొకచేతఁ దాల్చి వాతాయనసమీపమున కరుదెంచెను. వేఱొకయిందువదన, సగముకూర్చిన రతనాలమొలనూలు నల్లే చేత నిడుకొని, యడుగడుగునను జాఱిపడుచున్న మణులనైనఁ జూచుకొనక తుదకుఁ జేతియందు సూత్రముమాత్రమే మిగిలియుండుటయేని

గుర్తింపక, ద్వారముకడ కేఁగెను. ఆసమయమున నాసవగంధ గర్భితములై, విలోల నేత్రభ్రమరాంచితములైన పౌరభామినుల మోములతోఁ గూడియున్న సౌధవాతాయనము లన్నియుఁ గమలతోరణములు గట్టినసడువునఁ జూపట్టుచుండెను.

అంత, నీశుఁడు పగలయ్యు జడలయందలి యర్ధేందు ప్రభలచేఁ బురసౌధముల నన్నిటిని ద్విగుణ కాంతిమంతములఁ జేయుచుఁ, దుకూలపతాకాభిరామమై కాంచనతోరణాలంకృతమైన రాజవీథి నేఁగుచుండెను. పౌరులందఱు సర్వేంద్రియ వ్యాపారమును జక్షురింద్రియమునే ప్రవేశించిన ట్లతనిఁ దదేక దృష్టితోఁ గాంచుచుండిరి. పరమేశునిఁ గాంచినంతఁ బురకాంత లిట్లు ప్రసంగింప మొదలిడిరి: "శిరీషకుసుమ పేశలాంగి యగు నీ పార్వతి, సకలావణ్యమూర్తియు లోకైకనాథుఁడునగు నీతనిఁ బతిఁగాఁ బొందఁ గఠినతపం బాచరించినదన్న నెంతయు శ్లాఘనీయము గదా! ఎవ్వతెయైన నిట్టి భువనవంద్యు పాద దాస్యమైన యున్నంతమాత్రమునఁ గృతార్థ కాఁగలదన్న, నీతని యాలింగనము నందిన సీమంతిని యెంతధన్యాత్మురాలగును! ఇట్టి ఘనసైకరూపానులగు వ్యక్తులను జంటగాఁ గూర్పకున్న వీరికట్టి సౌందర్యసంపద నొసఁగిన విధాతప్రయత్నము కేవలము వ్యర్థముగదా! నిశ్చయముగా నీమహేశుఁడు కోపముచేఁ బంచ సాయకునిఁ బంచత్వ మొందించి యుండఁడు. ఈతని సాటిలేని యందమునుగాంచి లజ్జచే మనోభవుఁడే తనంతఁదాను దేహము

నుజ్జగించి యుండును.” అనెడు నా యోషధిప్రస్థ విలాసినీజన ప్రసంగములు వినుచు, ముత్తైదువలు చల్లెడు లాజవర్షము మూర్ధంబు నలంకరించుచుండ గిరిరాజభవనముఁ బ్రవేశించి, చక్రపాణి కైదండయొసఁగ శరన్మేఘమునుండి యవతరించిన సహస్రాంశుపోల్కి వృషభము నవరోహించి, హిరణ్యగర్భుఁడు పురోగామియై మార్గమును జూపుచుండఁ గక్ష్యాంతరములు గడచి, యింద్రాది దేవబృందమును సప్తర్షిప్రభృతి మునిమండలమును నందిప్రముఖ ప్రమథగణంబులును వెన్నాడివచ్చుచుండ, నాశంకరుఁడు వివాహమండపమును బ్రవేశించి, యచటఁ దనకై యునిచిన రత్నాసనమున నాసీనుఁడయ్యెను. దేవతలును మునులును హిమవద్బంధువులు చూపిన యాసనములపైఁ దమతమకుఁ దగిన తెఱఁగున నుపవిష్టులైన యనంతరమున, నద్రినాథుఁ డర్ఘ్యమును మధుపర్కమును నూత్నదుకూలములను నొసఁగి శివుని గారవించెను.

నవోదిత చంద్రికిరణములు ఫేనరాజి విరాజమానమగు పాలతరఁగను వేలాసమీపమునకుఁ గొంపోవు తెఱఁగున, వినీతులగు నంతఃపురదక్షులు దుకూలాలంకృతుఁడగు మహేశుని హైమవతి సమీపమునకుఁ దీసికొనిపోయి కూర్చుండఁ బెట్టిరి. శరత్సమాగమముచే జీవలోకముపలె, నుదిత చంద్రప్రకాశమానాననయగు పార్వతి సామీప్యముచే నీశుఁడు నూత్నవికాసము నందెను. యదృచ్ఛా సంభూతమగు ప్రథమ

సంసర్గక్షణమునం దా వధూవరుల నేత్రము లతిచకితములై, పరస్పర దర్శన లాలసములై, వ్రీడా విభ్రాంతములయ్యెను. పూర్వము పరమేశువలన భీతిఁజెంది పార్వతియందు గుప్తశరీరుఁడై యున్న పుష్పబాణుని సాయకాంకురమననొప్పు, నరుణాంగుళి సంశోభితమగు హైమవతీ కరపల్లవమును మహీధరుఁడందీయ మహేశుఁడు పరిగ్రహించెను. అన్యోన్య కరస్పర్శచే రోమాంచమొదవిన పార్వతియుఁ, జెమటవట్టిన శివుఁడును, మనోభవానుభావములను విభక్తమొనర్చి యనుభవించుచున్న ట్లుండిరి. ఉమామహేశుల యనుగ్రహముచే లోకములందలి యితరదంపతులే సాటిలేని కాంతితో విరాజిల్లుచుండ, సాక్షాద్గౌరీశంకరులు వివాహసంబంధముచే నపూర్వ కాంతిప్రకాశమానులై యుండిరని చెప్పనేల! ఉజ్జ్వలద్వైవాహికాగ్నికిఁ బ్రదక్షిణమొనర్చుచున్న యయ్యాదిమదంపతులు, మేరుశిఖరమును జుట్టి తిరుగుచున్న యహోరాత్రములపోల్కి విలసిల్లుచుండిరి. అన్యోన్య సంస్పర్శచేఁ గల్గిన యానందపారవశ్యమున నిమీలితనేత్రులై యుమామహేశులు మువ్మాఱగ్నిప్రదక్షిణ మొనర్చిన యనంతరమునఁ, బురోహితుఁడు పార్వతిచే లాజహోమమును జేయించి "వత్స! అగ్నిసాక్షిగా నీవిపుడు మహేశుని వివాహమాడితివి. ఇంక సోల్లాసముగా శివునితోఁగూడి ధర్మకార్యము లాచరించుచుండు." మని పల్క, నామె యయ్యుపదేశ మత్యాదరముతో నాలించెను. అత్యంత ప్రియదర్శనుఁడగు మహేశుఁడు 'ధ్రువు నవలోకింపు' మని ప్రేరేపఁ, బార్వతి

యొట్లో మోమునెత్తి వ్రీడోద్భూత మందస్వరమై 'చూచితి' నని పల్కెను.

ఇట్లు వివాహప్రయోగకుశలుఁడగు పురోధసుఁడు పాణిగ్రహణమహోత్సవము నిర్వర్తింప, జగజ్జననీజనకులగు నాయుమామహేశులు పద్మాసనోపవిష్టుఁడగు పితామహునకుఁ బ్రణామము లాచరించిరి. బ్రహ్మయు "కల్యాణి! వీరప్రసవా భవ" యని హైమవతి నాశీర్వదించి, నిరీహుఁడగు శివున కాశీస్సులతోఁ బ్రయోజన మేమని యెంచి కాఁబోలు వాగీశుఁ డయ్యు నతని దీవించుటలో మౌనముద్రను వహించెను. అనంతర మాదంపతులు వివిధకుసుమ మాలాంకృతమగు చతురంత వేదిపైఁ గనకాసనాసీనులై, లౌకికాచార ప్రకార మార్ద్రాక్షతారోపణ మహోత్సవము నెఱపిరి. అంత, శ్రీదేవి పత్రాంతలగ్న జలబిందువులు ప్రాంతలంబి ముక్తాఫల శోభనొదవింపఁ, గరధృతనాళదండమై పద్మాతపత్రము నయ్యాదిదంపతులపైఁ బట్టె, వాగ్దేవి యథాయోగ్య వాగ్రచనచే వధూవరుల నభినందించెను.

ముఖాదిసంధులయందుఁ గౌశిక్యాది వృత్తి భేదము విశదీకరించుచు, శృంగారాది రసములందు వసంతతిలకాది రాగముల నాలపించుచు నప్సరోంగనలు ప్రదర్శించు రూపకమును దిలకించి, యూర్వశీ మేనకాదులు ప్రదర్శించు వివిధ నాట్యభంగుల నవలోకించి, యానంద పారావారమునఁ

దేలియాడుచున్న యానూత్న దంపతులకడకు దేవతలరుదెంచి, మకుటబద్ధాంజలులై పరమేశు పాదములకుఁ బ్రణమిల్లి యిట్లు మనవియొనర్చిరి: "మహాదేవ! భవదీయ వివాహానంతరమున శాపవిముక్తుఁడై మరలఁ దన దేహమునందిన పంచసాయకుఁడు కృతజ్ఞత నివేదింప, మిమ్ము సేవించు నవసరమును బ్రతీక్షించుచుండెను." అనుమాటలాలించి మందహాసమొనర్చి మహేశుఁ డాతనిపరిచర్య నంగీకరించెను. కార్యజ్ఞులు ప్రభువులయొద్ద సకాలమున మనవియొనర్చినఁగదా యేకార్యములైనను సఫలములౌను! అంత నాయర్ధేందుశేఖరుఁడు దేవబృందమును మునిమండలమును సగౌరవముగాఁ దమతమ నెలవులకంపి, హైమవతీ మృదుల హస్తపల్లవమును దనకరపద్మమునఁ గీలించి, సువర్ణ మంగళకలశాలంకృతమైన విలాసభవనమును బ్రవేశించెను. ఆకౌతుకాగారమునందుఁ బరిణయ సంభూత లజ్జావిభూషణయై, శివుఁడు తన సమీపమునకుఁ దీసికొను చుండ మారొత్తిమిడుచు, నర్మసఖీ ప్రసంగములకుఁ గూడ నతికష్టముగా సమాధాన మొసఁగుచున్న పార్వతిని, హాస్య రసప్రదర్శన ప్రవీణులగు భృంగీరిటాది పరమేశపారిషదులు వికృతముఖచేష్టలచే నప్రకాశముగా నవ్వించుచుండిరి.

---

# కుమారవిజయము

## ఏకాదశ స్తబకము

# విలాసవిహారము

—:o:—

పాణిగ్రహణానంతరమున లజ్జాభయసంభ్రమ సంకుచితమై, నూత్నలావణ్య విలసితమైన హైమవతీ శరీరవిన్యాసము మహేశ్వరు నానందమునకుఁ బ్రతిక్షణదోహద మొనర్చు చుండెను. క్రీడావసరములందు లజ్జచే మౌనముద్ర వహించియున్న పార్వతిని శివుఁడెట్లైన మాటలాడింపవలయునని యెద్దియో యప్రస్తుతార్థవిషయమై ప్రశ్నింప, నామె శిరశ్చాలన రూపమాత్ర ప్రత్యుత్తర మొసఁగుచుండును. నిర్మల ముకురమును ముందిడుకొని యందాత్మరూపమును జూచు వెనుక నిలిచియున్న ప్రియుని ప్రతిబింబమునుగాంచి పార్వతి యున్నయెూ విలాసచేష్ట లొనర్చుచుండును. ఇట్లు నిశాసమయముగడపి, ప్రభాతమునఁ జెలిమికత్తెలు దరిఁజేరి రాత్రిప్రవృత్తవృత్తాంతము నడుగ సిగ్గుచే నొక్కింతయుఁ జెప్పకుండును. కాని హృదయ, మునమాత్రము దెలుపవలయునని కుతూహలపడుచుండును. ప్రియపరిభుక్త యౌవనయగు దుహితం గాంచి తల్లియగు మేనక యింతంతనరాని సంతస మందెను. భర్తృవాల్లభ్యము నందిన వధూజనముగదా తన్ను గని పెంచి పెద్దసేయుటలో

ననేక కష్టముల కోర్చిన మాతృదేవత కానందము నొదవించు నది!

ఇట్లు పార్వతి ముగ్ధమధురమూర్తియై పరమేశునితోఁ గొన్నిదినములు గడపి, క్రమక్రమముగా నాస్వాదితప్రేమైక హృదయ యయ్యెను. కటాక్షాది భావసంసూచితమై, యప్రియా చరణమన్న నెట్టిదో యెఱుఁగక, ప్రియాలాపములచే వృద్ధి నందుచు, క్షణమాత్రవియోగమును సహింపని యయ్యాది దంపతుల ప్రణయ మితరేతరాశ్రితమై నిబిడీకృత మయ్యెను. మహేశుఁడు హైమవతి నెట్లాత్మాభిన్నముగా ననురాగముతోఁ జూచుచుండెనో, యట్లే పార్వతియు గిరీశు నాత్మాభిన్నముగా నధికప్రేమతోఁ జూచుచుండెను. ప్రేమసుధాతరంగ పూరిత యగు మందాకిని పయోనిధిప్రణయతరంగముల యాలింగన మునఁ గరఁగిపోవుటయు, సాగరుఁడు వియన్నదీముఖ రసా స్వాదనముచే నానందపూరితుఁడగుటయుఁ బ్రకృతిసిద్ధ విషయ ములేగదా!

ఈసమయమున సర్వేంద్రియసంతర్పణముగాఁ దన్ను సేవించిన మనోభవునిఁ బునరుజ్జీవింపఁజేసి, శివుఁడు పార్వతితో శైలరాజ భవనమున మాసమాత్రముండి, యనంతర మటనుండి వెడల సంకల్పించి, కూఁతు నెడఁబాటునకు దురపిల్లు హిమవంతు నంగీకరింపఁజేసి, యప్రతిహత గమనముగల వృషభము నధి రోహించి, వివిధవిలాసప్రదేశముల విహరింపఁ బయనమయ్యెను.

తొలుత బంగరుకొండకు వెడలి, లేఁతచివుళ్లచే నిర్మింపఁబడిన యచటి శయ్యలపైఁ గొంతకాలము విహరించి, యనంతరమున మందరాద్రి కేఁగి, యచటి ప్రత్యగ్రసుధాబిందు మనోహరములైన విష్ణుపాదాంకిత సానువులయందు విశ్రమించి, యటనుండి స్వాశ్రయమగు కైలాసమునకు వెడలెను. ఒకనాఁడు రావణుఁడు వినోదమునకై యా రజతాద్రి నూఁగిసలాడింప, నయ్యదిరిపాటునకు బెదరి, పార్వతి శివునిఁ గౌఁగిలించుకొనియె. అప్రయత్నముగా సంభవించిన ప్రియాలింగనమునకు మహేశుఁడమితానందమునందుచు, శశిచంద్రికలు పారణముగాఁ గొంచు నచటఁ గొంతకాలముండి మలయాచలమునకుఁ బోయెను. అందలి పిల్లగాలులు చందనలతలయందలి చల్లఁదనమును వహించి, లవంగకేసరపరిమళము నాస్వాదించి యాదంపతుల విహారజనితశ్రమాంబుకణములను బోఁగొట్టుచుండెను.

అంత మలయానిలముచే మందమందముగాఁ జలించు తరంగములుగల యచటి నదీప్రవాహమునం దవగాహన మొనర్చుచుఁ, బరిహాసమునకై రక్తోత్పలములఁ దనపై విసరుచుఁ, దత్కరాక్షిప్తజలముచే నేత్రముల నిమీలన మొనర్చుచు, స్నానోత్తీర్ణయగు పార్వతిని మహేశుఁడు పారిజాతకుసుమములచే నలంకరించుచుండ, ననిమిషాంగనలందఱును నా భర్తృవాల్లభ్యమును దనివారఁగాంచి, దాంపత్యమన్న నిట్లుండవలయునని వేనోళ్లఁ గొనియాడిరి.

ఈరీతి భౌమ స్వర్గీయసుఖముల ననుభవించుచు నట నొక్కింతకాలముండి, యాదంపతు లొకనాటి సూర్యాస్తమయ సమయమున గంధమాదనమునకుఁ గ్రీడలొనర్ప నేఁగి, యచట నొకకాంచన శిలాతలమున నాసీనులై యయ్యద్రిశోభను దిలకించుచుండిరి. అంత నస్తాచలోన్ముఖుఁడైన యరుణునిఁ గాంచి వామభుజము నవలంబించియున్న హైమవతికిఁ దాత్కాలికదృశ్యములఁ జూపుచు మహేశుఁడిట్లనియె: “దేవి! యాలోక బాంధవునిఁ గనుఁగొనుము. ఇతఁడు కమలశోభనంతయుఁ ద్రిభాగారుణములైన నీనేత్రములయందిడి, విధాత ప్రళయమందు జగమ్ములమాడ్కి దినము నుపసంహరించుచుండెను. తినుచున్న పద్మకింజల్కములను విడనాడి, యొండొంటి నరయుటకై మెడలుతిప్పి, వియుక్తములైన యాచక్రవాకములు పాపము! ఎట్లాక్రందన మొనర్చుచున్నవో చూడుము! ఆదిక్కు గనుం గొనుము, వనగజములు దినమంతయుఁ దాముగడపిన వృక్షచ్ఛాయల విడనాడి, సరోవరముఁ బ్రవేశించి, సల్లకీపల్లవ సంవాసితములై పద్మపరిమళ మనోహరములైన జలములఁ గ్రోలుచున్నవి. ఆపశ్చిమదిక్కునకుఁ బోవుచున్న సహస్రభానునిఁ దిలకింపుము. ఆయతమైన తనప్రతిబింబపంక్తిచేఁ గాసారజలములకు సౌవర్ణసేతుబంధన మొనర్చుచున్నట్లున్నాఁడు. వనవరాహములు గాఢపంకనిర్మగ్నములై యాతపసమయమును గడపి, యిప్పుడిప్పుడే పల్వలముల వీడి గుంపులుగుంపులుగా నిజనివాసముల కరుగుచున్నవి, అటుచూడు మా వృక్షాగ్రమున

మయూరవెుకండు క్షీణించుచున్న దినాంతాతపమును గ్రోలుచున్నదివోలె, బంగరుజలపోసన మొనర్చినట్లున్న బర్హమును విప్పి యాడుచున్నది. తూరుపుదెసనుండి కనుచీకటు లలము కొనుచుండఁ, బడమటిదెస నించుకించుక మిగిలియున్న కట్టెండతో నాయాకస మల్పావశిష్టంబగు సరోవరమును దలపించుచున్నది చూడుము! పెంపుడుమృగములన్నియుఁ బర్ణశాలాభ్యంతరమునఁ బ్రవేశించుచుండ, హోమధేనువు లంభారవము లొనర్చుచుఁ దమదూడలున్నచోటి కేఁగుచుండ, హోమాగ్నులు ప్రజ్వరిల్లుచున్న యయ్యాశ్రమభూము లెంతకనులకింపుగా నున్నవో కనుంగొనుము! ముకుళింపనున్న యాశతపత్రము భ్రమరమునకుఁ దనలోఁ దావొసఁగఁ గొంతకాలము నిరీక్షించుచున్నట్లు సావశేషవివరమై యున్నది. ప్రతీచీదిగంగన యరుణభానుని సంపర్కముచే, బంధుజీవకుసుమమును దిలకముగా నలంకరించుకొన్న కన్యవలె నెట్లు కలకలలాడుచున్నదో గాంచితివా! తపంబొనరించుచున్న వాలఖిల్యాదిమునులందఱును, హుతవహునియందుఁ దన తేజమునంతయును నుంచి యస్తమింపనున్న సహస్రరశ్మిని సామగానములచే నెంత హృదయంగమముగా స్తోత్రమొనర్చుచున్నారో యాలకింపుము. ఈయహర్పతి దివసమునంతయు సముద్రగర్భమునఁ బడవైచి, వినమ్రకంధరములై కర్ణచామరముకుళితనేత్రములైన యశ్వములఁబూన్చిన యరదము నరుణుఁడు నడపుచుండ నస్తాచలమునకుఁ బోవుచున్నాఁడు. సూర్యుఁడస్తమించినంతనే

లోకమంతయు నిద్రవోవుచున్నట్లున్నది. తోజోరాశి యుదయించుచోటు ప్రకాశమానమగుటయు, నది యస్తమించినంత నాప్రదేశము సంకుచితమగుటయు సంభవించునుగదా! అస్తశిఖరమునకుఁ బోయిన తపనునివెంట సంధ్యగూడ నెట్లనుగమించుచున్నదో తిలకింపుము. పూర్వముదయమున నాతనిచేఁ బురస్కృతయైన యయ్యది యిప్పుడాతని నెట్లనుసరింపకుండును! నిన్ను వినోదింపఁజేయుటకై సంధ్య, చిత్రశలాకలచేఁ జిత్రించిన మనోహరదృశ్యమా యనునట్లు, రక్తకపిశాది నానావర్ణములచే నా జలధరాగ్రము లెంతరమణీయములుగా నున్నవో చూడుము! తపనుఁడు తా నస్తమించుసమయమున సాంధ్యాతపమును సింహకేసరములకును,బల్లవములుగల భూరుహములకును,ధాతుమద్గిరి శిఖరములకును సమానముగాఁ బంచియిచ్చినట్లయ్యవి యెంత యరుణారుణములై యున్నవో కనుఁగొనుము! పాదాగ్రముల భూతలమును స్పృశించుచు, నీమహర్షులందఱును శ్రద్ధావంతులై పవిత్రాంబువులచే సూర్యున కర్ఘ్య నొసఁగి, పరిశుద్ధికై నిగూఢముగా గాయత్రిని జపించుచున్నారు. కనుక ప్రస్తుత సాంధ్యకృత్యములఁ జేయుటకై యొక్కక్షణకాలము నాకవకాశమొసంగుము. ప్రసంగ నిపుణలగు చెలికత్తియలింతలో నిన్ను వినోదింపఁజేయుదురు.” అను మాటలాలించి త్రుటికాలవియోగమేని సహింపక పార్వతి సావజ్ఞముగాఁ బెదవి విఱిచి, సమీపముననున్న విజయతో నేదియో మాటలాడు నెపమున శివునకుఁ బ్రత్యుత్తర మొసఁగలేదు.

మహేశుఁడును మంత్రపూర్వకముగా సాంధ్యకృత్యముల నిర్వర్తించి మరలివచ్చి, యసూయచే మాటలాడకున్న పార్వతినిఁగాంచి మోమునఁ జిఱునవ్వొలయ నిట్లనియె: "దేవీ! యేల యకారణముగాఁ గోపమూనియుంటివి? నన్ను నమస్కరించినది సంధ్యగాని యిఁకెవ్వతెయుఁ గాదు. అనన్యాసక్తుఁడగు నీసహధర్మచరుని హృదయ మామాత్ర మెఱుఁగవా! సంధ్య నన్నుదయాస్తమయ సమయములందు సేవించుచుండును. అందుచే నాకామెయందెంతో గౌరవము. అంతియకాని వేఱుగాదు." అని యయ్యష్టమూర్తి యకారణ జనితమైన పార్వతి కోపము నపనయించి, మరల సాంధ్యదృశ్యముల నామెకుఁ జూప మొదలిడెను:

"హైమవతి! యంధకారోపరుద్ధమై భూమిపైఁ జిక్కువడినదివోలెనున్న యీసంధ్య, యిరుప్రక్కలఁ దమాలపంక్తులు గల ధాతుద్రవనదివలె నున్నది యీక్షింపుము. అస్తంగతావశిష్టమై రక్తరేఖాకృతినున్న సాంధ్యాతపమును ధరించిన ప్రతీచి, శోణితలిప్తమైన కృపాణముగల యుద్ధభూమిశోభను వహించియున్నది. కటికిచీఁకటులు దిక్కుల నలముకొనుచుండ నేత్రప్రసారముడిగియున్న యీలోకమంతయు గర్భవాసము నొందుచున్నట్లున్నది. నిర్మలము మలినము, స్థిరము చలము, వక్రము సరలము నాదిగాఁగలవన్నియుఁ దమఃప్రసారముచే నొక్కరీతిగాఁ జూపట్టుచున్నవి. మంచిచెడ్డల నేక

మొనర్చు కుచ్చితుల యధికారము కాదాచిత్క-మైనను గర్వ్యాముగదా! చంద్రముఖి! తమోనివృత్తియొనర్ప నిశానాథుఁ డుదయింప నున్ముఖుఁడైనట్లున్నాఁడు. కనుకనే ప్రాగ్దిశాంగనా ముఖము కైతకీరజఃపటల మలందిన తెఱఁగునఁ గలకలలాడు చున్నది. తారకాపరివేష్టితమైన యీ నిశ మందరపర్వతాంత రితమూర్తియగు కళానాథునితోఁగూడి, చెలిమికత్తెలు చుట్టు వాల్కొనియుండ నర్మప్రసంగములొనర్చు నీమాటలను చాటు నుండి నేను వినుచున్నప్పటి సంవిధానమును దలపించుచున్నది. ఆకసమునందును సరోజములందు నున్న చంద్రుని బింబప్రతి బింబములు, వియుక్తములై యతిదూరముగానున్న చక్రవాక ముల జంటవలె నున్నవి. పార్వతి! నవేందుకాంతిచేఁ జీఁకటి యంతయుఁ బటాపంచలగుచుండ, నభోంగణము, గజక్రీడాకలు షితమై యిపుడిప్పుడే తేఱుకొనుచున్న మానససరోవరమువలె నున్నది పరికింపుము.

కువలయబాంధవుఁడు తానుదయించినప్పటి రక్తభావ మును విడనాడి క్రమక్రమముగాఁ బరిశుద్ధమండలుఁ డగు చుండెను. స్వచ్ఛస్వభావులయెడఁ, గాలదోషముచే జని యించిన వికారము శాశ్వతముగా నుండనేరదుగదా! నిర్మల మనోహరచంద్రిక యున్నతములైన గిరిశృంగములయందు విహ రించుచుండ, గాఢాంధకారమంతయు గర్తాది నీచస్థానముల నాశ్రయించుచుండెను. ఆవిధాత గుణదోషములకనురూపమైన

గతిని గల్పించియేయుండును. హిమవంతుఁడు, చంద్రకిరణము లచేఁ జెమ్మగిలిన యిందుకాంతమణిజలబిందువులఁ జిమ్మి, మేఖలాతరుచ్ఛాయల నిదురించు మయూరములను పాపము! అకాలమందే మేల్కొలుపుచుండెను. చీఁకటివెన్నెలలు కలయఁబర్వి యెత్తుపల్లములతోఁ గూడియున్న యీపర్వతము వివిధరచనాలంకృతమైన మత్తగజము ననుకరించుచున్నది. ఈ కైరవ మైందవచంద్రికారసము నతితృష్ణతోఁ ద్రావి, దానిఁ దనలో నిముడ్చుకొనుటకు శక్తిలేమి భృంగనాదారావ మొనర్చుచు వృంతమూలమునుండి ముకుళగర్భము భిన్నమగుచున్నదోయన వికసించుచున్నది పరికింపుము. స్ఫురన్మండలయగు నాయోగ్యతారతోఁ గూడిన కుముదబాంధవుఁడు, సాధ్వసవేపమానాంగియై నవోఢయగు కన్యతోఁ గూడిన వరునిఁ దలపించుచున్నది చూచితివా!

హైమవతి! గంధమాదనవనదేవత యరుణార్కమణిభాజనమునందుఁ గల్పతరుప్రసూనమధువు నిడుకొని స్వగృహాగతవైన నిన్ను గౌరవించుటకై వచ్చినది. స్వాభావారుణనయనాంచితమై, సరసకేసర సుగంధియైన నీమోముదమ్మి కీమధు వింకేమిగుణవిశేషమును గలిగించును! అయినను సఖీజనమర్పించిన సేవలందుకొనుట కర్తవ్యముగాన నీమధువు లారగింపు." మని యాపుష్పాసవము పార్వతిచేఁ ద్రావించెను. అయ్యాసవ మానుటచేఁ జలన్నేత్రమై, స్వేదకణాంచితమై, మందహాస

మనోహరమైన యుమాముఖమును గాంచి పరమేశుఁ డమితానందము నందెను. అనంతరమున, నయ్యుమామహేశులు, మణిశిలావినిర్మిత విలాసభవనంబుల వివిధవిహారము లొనర్చి, సుఖనిద్ర వడసి, కిన్నరోద్గీత మంగళగీతికలచే నుషఃకాలమున మేల్కాంచిరి.

ఇట్లయ్యాదిమదంపతులు గంధమాదనమున నివసించి, సర్వసౌఖ్యముల ననుభవించుచు, నవిజ్ఞాతరాత్రిందివముగా ఋతుశత మొక్క త్రుటికాలముగా గడపిరి.



Printed by Royal Printing Works, Tanuku, Paper Issue Card W. G. No. 37. For Sri Tirupati Venkateswara Book Depot, Rajahmundry. Paper Issue Card E. G. No. 20, 3rd June 1946 - 2500 Copies.